# శ్రీ శంకర జీవితం

శంకరభగవత్పాదులు కారణజన్ములు. మనందరిలా జన్మించిన వారు కారు. మనం దేనికోసం జన్మిస్తామంటే గత జన్మలలో చేసిన పాప పుణ్యాల ఫలితాలను అనుభవించటం కోసమని ప్రాకృతమైన శరీరంలో ప్రవేశించి ఆ కర్మ ఫలితాన్ని సుఖంగా, దుఃఖంగా అనుభవిస్తుంటాం. శంకరుల జీవితం అటువంటి జీవితం కాదు. వారు సాక్షాత్తుగా సదాశివుడే. కైలాసవాసియైన శంకరుడికి, కాలడియందు జన్మించిన శంకరునకు అభేదం. ఇద్దరూ ఒక్కటే. స్వామి అనేకమైన అవతారాలను స్వీకరిస్తాడు. పరబ్రహ్మ 'పరిత్రాణాయ సాధూనాం. వినాశాయచ దుష్కృతాం ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.' అన్నారు. ఒక్కొక్కనాడు లోకంలో రాక్షసులతాకిడి ఎక్కువగా ఉంటుంది. ధర్మము ఇబ్బంది పడుతుంది. మళ్ళీ ధర్మసంస్థాపన చేసి రాక్షస సంహారం చేయుటం కోసమని ఈశ్వరుడే అవతారాలను స్వీకరించి కరచరణాదులతో కదిలివచ్చి రాక్షస సంహారం చేస్తుంటాడు. ఒక్కొక్కనాడు లోకంలో భక్తి జ్ఞాన వైరాగ్యాల ప్రబోధాలు చెయ్యడం కోసం కూడా భగవానులు అవతారం స్వీకరిస్తాడు. అలా శంకరభగవానులు స్వీకరించిన మహోత్కృష్టమైన అవతారాలలో ఆదిశంకరాచార్యుల వారి అవతారం ఒకటి.

శంకరులు మాధవ మాసంలో జన్మించారు. చైత్ర మాసాన్ని మధుమాసం అని పిలుస్తారు. వైశాఖ మాసాన్ని మాధవ మాసం అని పిలుస్తారు. వైశాఖ మాసంలో శంకరభగవత్పాదులు జన్మించారు. వైశాఖ మాసానికి మాసముల రీత్యా ఒక ప్రత్యేకమైన ప్రశస్తి ఉంది. ఇది పృథ్వీ సంబంధమైన నెల. ఈ

సమయంలో రెండు వస్తాయి. ఒకటి మల్లెపూవు. రెండు మామిడిపండు. మామిడి పండు అపారమైన మాధుర్యానికి గుర్తు. మల్లెపువ్వు అపారమైన సువాసనకు గుర్తు. శంకరభగవత్పాదులు కూడా వైశాఖ మాసమునందే అవతారాన్ని స్వీకరించారు. వైశాఖ మాసంలో జన్మించిన శంకరభగవత్పాదుల వారి మాటలు కానీ, స్తోత్రాలు కానీ వారు చేసిన ప్రకరణాలు కానీ, వాఖ్యానాలు కానీ అవి మధురాతి మధురాలు. వాక్కునకు మాధుర్యం లేకపోతే అది ఆస్వాదించబడదు. అది ఎంత గొప్ప విషయమైనా కానివ్వండి. అది చెప్పే వాడి మాటయందు కాఠిన్యం ఉందనుకోండి. ఆ చెప్పే మాట పది మంది వినటానికి ఇష్టపడరు. ఆ మాట సరళంగా వినే వారి హృదయాన్ని రంజింపచేసేటటువంటి కోమలత్వంతో, మాధుర్యంతో, ప్రతిపాదింపబడాలి. వాక్కు మాధుర్యాన్ని కలిగి ఉండి. అటువంటి వాక్కును ప్రతిపాదించటంలో శంకరులకు శంకరులే సాటి. అటువంటి శంకరులు. సువాసనతో కూడిన వాసంతికా పుష్పం అంటే మల్లెపువ్వు పుట్టే మాసంలోనే వారు కూడా జన్మించారు. మల్లెపువ్వులు ఈ మాసంలో విశేషంగా వస్తాయి. మల్లెపువ్వు అసురసంధ్యా కాలంలో బాగా విచ్చుకుంటుంది. సాధారణంగా పద్మం సూర్యకిరణాలు తగలగానే ఉదయం వేళ విచ్చుకుంటుంది. మల్లె పువ్వు ఉదయం వేళ విచ్చుకోదు. బాగా అసురసంధ్యవేళలో అంటే ఉత్తర సంధ్యయందు చీకటి పడుతూండగా బాగా విచ్చుకుని విశేషమైన సువాసననిస్తుంది. దానికి సంధ్యాకాలం అని పేరు.

సంధ్య అంటే రెండు సంకల్పాల మధ్యలో ఉన్న అసలు ఏ సంకల్పమూ లేని చైతన్య స్వరూపమైన స్థితి. అంటే మీకు ఇంకొక విధంగా చెప్పాలంటే మనం నిద్రలేచింది మొదలు మనసులో నిప్పుల్లోంచి రవ్వలు పైకి వచ్చినట్టు అనేకమైన అలోచనలు వచ్చేస్తుంటాయి. ఆ ఆలోచనలకు ఇంక ఎడతెరిపి ఉండదు. అవి అలా పుట్టేస్తుంటాయి. అందుకే మనస్సనగా సంకల్ప వికల్ప సంఘాతం అంటారు. అసలు మన యథార్థ స్థితి ఎక్కడ ఉన్నది? అంటే

రెండు సంకల్పాలకు మధ్యలో ఏ సంకల్పం లేకుండా ఉన్న కొద్దిపాటి సమయమేదున్నదో అది ఏ సంకల్పంలేని సమయం. ఆ సమయం మన నిజస్వరూపం. అది ఆత్మ. అటువంటి ఆత్మ స్వరూపం సంధ్యా సమయంచేత ప్రతిపాదించ బడుతోంది. అందుకే 'సంధ్యారంభ విజృంభితం శ్రుతిశిరస్థానాం తరాధిష్ఠితం' అంటారు. శ్రుతి శిరస్సు అంటే వేదముల చిట్టచివర ఏర్పడినవి ఉపనిషత్తులు.

ఉపనిషత్తులు జ్ఞానభాగాలు. జ్ఞానాత్ కేవల కైవల్యం. జ్ఞానం చేత మాత్రమే మోక్షమొస్తుంది. అందుచేత అటువంటి జ్ఞానకాండలో ఉన్న అద్వైత సిద్ధాంతాన్ని ప్రచారంచేసి ఆత్మ తత్త్వాన్ని ఆవిష్కరించారు. 'మోక్షం ఎప్పుడో ఎక్కడో నువ్వు ఏదో చేస్తే వచ్చేది కాదు. నువ్వు సహజంగా మోక్ష స్వరూపుడవు. నువ్వు బంధమునందున్నవాడివి కావు. ఇప్పుడే ఇక్కడే మోక్షాన్ని పొంది ఉన్నావు. అది నువ్వు తెలుసుకోలేదంతే. తెలుసుకుంటే మోక్షం పొందినవాడివే' అంటారు శంకరులు. శంకరుల తర్కం సామాన్యమైన వాదం కాదు. వారు ప్రచండ ఝంఝామారుతం.

శంకరభగవత్పాదులు రాకముందు దేశంలో అనేకమైన వాదాలున్నాయి. రకరకాల వాదాలతో వేదంలోంచి ఎవరికితోచిన సిద్ధాంతాలను వాళ్ళు ప్రతిపాదన చేసారు. శంకరులు అడుగుపెట్టారు. మనకి ఒక గమ్మత్తు ఉంది. కేరళరాష్ట్రానికి, కాశీపట్టణానికి ఈ రెండిటికీ భారతదేశంలో భౌగోళికంగా ఒక ప్రత్యేకస్థానం ఉంది. ఒకసారి పరిశీలన చేసి చూడండి. కేరళ రాష్ట్రంలో అంటే శంకరాచార్యుల శాపానికి ముందు మాట నేను చెప్తున్నది. శంకరాచార్యులవారు శాపమిచ్చారు కేరళ రాష్ట్రానికి. ఒకటి, ఈ రాష్ట్రం ఇంత గొప్పదయినా రాబోవు కాలమునందు ఇక్కడ భారతదేశంలో తర్క ప్రచారం చేయు పీఠం ఉండకుండుగాక అని శపించారు. అందుకే కేరళలో శంకరాచార్యుల వారు పుట్టినా పీఠంలేదు. కర్ణాటకలో పీఠం ఉంది. రెండు, ఇంటి వెనకాల సమాధులు కూడా వెలయు గాక. ఇళ్ళ వెనకాతల సమాధులు

కట్టుకునే వాళ్ళ సంఖ్య అక్కడ ఎక్కువ. మూడు, సనాతన ధర్మమై వేదంచేత ప్రతిపాదించబడిన సిద్ధాంతాన్ని తిరస్కరించి జీవించేవారి సంఖ్య ఎక్కువగా ఉన్న ప్రాంతంగా కేరళ భావింపబడుగాక. కేరళ అందుకే అలా అయిపోయింది. ఇదీ ఈనాటి కేరళ పరిస్థితి గురించి నేను మాట్లాడటంలేదు. నేను మాట్లాడుతున్న కేరళ రాష్ట్రం శంకరభగవత్పాదులు జన్మించినప్పటి కేరళ రాష్ట్రం. ఇప్పటికీ ఆ వాసనలు కేరళ రాష్ట్రంలో కొన్ని ఉన్నాయి. ఏవి అంటే కేరళయందు రెండెక్కువ. ఒకటి కొబ్బరికాయలు. రెండు అరటి పండ్లు. కొబ్బరికాయలు, అరటిపండ్లు ఉంటే ఎందుకండీ? మీరు గుళ్ళో కెళుతున్నారని ఏమిటి గుర్తు? కొబ్బరికాయ, అరటిపళ్ళు చేతిలో ఉంటాయి. తోటకూర, గోంగూర పట్టుకున్నారంటే మీకు తెచ్చుకుంటున్నారు. కొబ్బరికాయ, అరటిపళ్ళు చేతిలో పట్టుకున్నారంటే దేవాలయానికి వెళుతున్నారు.

నంబూద్రి బ్రాహ్మణులు విశేషమైన జ్ఞాన సంపన్నులు. అపారమైన సదాచార సంపన్నులు. అటువంటి నంబూద్రి బ్రాహ్మణులకి ఆవాసస్థానం కేరళ. అందునా కొబ్బరి బోండాం. పూర్ణకుంభం. కొబ్బరికాయ మన జీవితాన్ని చెప్తుంది. అరటిపండు దూర్వాసో మహర్షి వరప్రసాదం. కదళి ఆయన భార్య పేరు. ఆయన తన భార్యను శపించాడు. శపిస్తే ఆవిడ మరణించింది. శరీరం విడిచిపెట్టి బూడిదయ్యింది. మామగారొచ్చి దెబ్బలాడాడు. అదేమిటి అలా కాల్చేసావు నీశాప దృష్టిచేత. నీకు పిల్లనిచ్చినప్పుడే మాట ఇచ్చాను. ఎందుకిలా చేసావు అని. అంటే అప్పుడు వరమిచ్చాడు. నా భార్య కదళి కాల్చబడినా ఉత్తర జన్మలలో కదళీ వృక్షంగా జన్మిస్తుంది. ఇక విత్తనం వేయక్కరలా ఒకసారి కదళీ వృక్షం పెడితే చెట్టు పడిపోతున్నప్పుడు మళ్ళీ ఇంకొక పిల్ల పుట్టేస్తుంది. ఇంకొక చెట్టు పుట్టేస్తుంది. కదళీ ఎక్కడయినా సరే. దేవతల ఆరాధనలో ఉపయోగపడుతుంది. అరటిపండు లేని పూజ ఉండదు అని. అందుకే కదళికి అంత విశేషమైన ప్రఖ్యాతి. ఆ కదళీ ఫలం, నారికేళం. ఈ రెండూ కేరళలో ఎక్కువ. రెండవ పట్టణం దేని ప్రస్తావనచేసాను నేను. కాశీ, కాశీకి ఉన్న

# తిరుమల విశిష్టత

**కలౌ వేంకట నాయకః**

శ్రీ వేంకటాచలపతి కలియుగంలో సమస్త ప్రపంచాన్నీ నిర్వహించే దక్షత, బాధ్యతని స్వీకరించిన స్వరూపం. శ్రీ వేంకటేశ్వర వైభవం సామాన్యమైన విషయం కాదు. ఆయన పేరే వేంకటేశ్వరుడు. మిగిలిన అవతారాలకూ వేంకటేశ్వర అవతారానికీ ఒక ప్రధానమైన భేదం ఉంది. మిగిలిన అవతారాలలో ఆయనకు రకరకాలైన పేర్లు వచ్చాయి. మత్స్య, కూర్మ, వామన, నృసింహ, కృష్ణ, రామావతారాలెన్ని వచ్చినా, ఆయా అవతారాలలో స్వామికి తన గుణాలను ఆవిష్కరించడం చేత ఒక ప్రత్యేకమైన నామంచేత పిలువబడ్డాడు. కలియుగంలో పిలువబడే పేరు వేంకటేశ్వరుడు. ఆయన తీసుకునేది కూడా తల వెంట్రుకలు. చాలా చిత్రమైన విశేషం. వేంకటేశ్వరుడు అన్న పేరులోనే ఉంది రహస్యమంతా. కలియుగంలో ఎవరికీ భగవంతుని చరణారవిందాలలో మనసు నిలబడదు. కలి ప్రభావం చేత చంచల చిత్తమై తిరుగుతుంటుంది.

శంకరులు శివానందలహరిలో–

**సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ**
**నట త్యాశా శాఖా స్వటతి ఝటితి స్వైర మభితః**
**కపాలిన్! భిక్షో ! మే హృదయకపి మత్యంతచపలం**
**దృఢం భక్త్యా బద్ధ్వా శివ! భవదధీనం కురు విభో? ॥**

కాళహస్తీశ్వరశతకంలో ధూర్జటి –

**తమకం బొప్పఁ బరాంగనాజనపర ద్రవ్యంబులన్ ముచ్చిలం**
**గ మహోద్యోగము సేయు నెమ్మనము దొంగం బట్టి వైరాగ్యపా**
**శములం జుట్టి బిగించి నీదు చరణస్తంభంబునం గట్టివై**
**చి ముదం బెప్పుడుఁ గల్గజేయఁ గదవే శ్రీకాళహస్తీశ్వరా!**

మనసుని నిగ్రహించడం అంత తేలిక కాదు. మనసు చేత అనేక పాపాలు చేస్తుంటాము. ఈ పాపాలు చేసే వారిని ఉద్ధరించడంకోసమని పరమాత్మ శ్రీ వేంకటేశ్వరుడిగా వచ్చారు. 'వేం' అంటే పాపం 'కట' అంటే తొలగించేవాడు. మన పాపం ప్రతిబంధకంగా వచ్చి పరమేశ్వరుని చేరకుండా అడ్డగిస్తుంది. సాక్షాత్తుగా పరబ్రహ్మకే పాపాన్ని తొలగించగలశక్తి ఉంది. పాపం తొలగించగల ఈశ్వరుడై అంటే నియామకుడై సర్వజగత్తుని కాపాడే ధారకుడు, పోషకుడు, శాసించగలిగిన వాడై సాక్షాత్తుగా వైకుంఠం నుండి శ్రీ మహావిష్ణువు కదలి వచ్చిన క్షేత్రం వేంకటాచల క్షేత్రం. అన్నమాచార్యులవారు వేదాలే పర్వతాలుగా వెలసినది తిరుమల కొండ అంటారు. బ్రహ్మాండోత్తర పురాణంలోనూ, వరాహ పురాణంలోనూ వేంకటాచల ప్రశస్తి అని ప్రత్యేకంగా వర్ణించారు. ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క అవతారంలో ఒక్కొక్క మూర్తిగా స్వామి జగద్రక్షణ చేస్తూ వచ్చారు.

**కృతేతు నారసింహో త్రేతాయా రఘునందనః**
**ద్వాపరే వాసుదేవశ్చ కలౌ శ్రీవేంకట నాయకః**

ప్రధానమైన మూర్తులు–కృతయుగంలో నారసింహుడుగా జగత్తుని రక్షించాడు. త్రేతాయుగంలో శ్రీరామచంద్రమూర్తి అయి రక్షించాడు. ఆయన ఏ అవతారంలో ఉన్నా పక్కన శ్రీకారం ఉంటుంది. సంప్రదాయంలో వివాహమైన తరువాత పేరు పక్కన శ్రీకారం లేకుండా రాసుకోకూడదు. రాముడు కూడా శ్రీరాముడని పిలవబడ్డాడు. బాలకాండలో విశ్వామిత్రుడు ఇక్కడనుండి రాముణ్ణి లోకరక్షణకొరకు అప్పచెపుతున్నామని అంటాడు. ఎందువలన అనగా శక్తి పక్కన చేరిన తరువాత శ్రీరాముడు పూర్ణత్వం పొందాడు. ఆయన లోకరక్షణార్థమని పదహారు గుణాలు కలిగిన సంపూర్ణమైన నరుడు ఎలా ప్రవర్తిస్తాడో అలా ప్రవర్తించాడు.

**కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్**
**ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః**
**చారిత్రేణ చ కో యుక్తః సర్వ భూతేషు కో హితః**
**విద్వాన్ కః కస్సమర్థశ్చ కశ్చైక ప్రియదర్శినః**
**ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కోఽ నసూయకః**
**కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే ॥**

శ్రీమద్రామాయణరచన ప్రారంభించే ముందే వాల్మీకి అడుగుతారు. ఆయన ప్రశ్నకి జవాబుగా పదహారు గుణాలూ పరిపూర్ణంగా ఉన్న అవతారం రామావతారమని నారద మహర్షి ప్రవచించారు. పదహారు గుణాలు కలిగిన రాముడు లోకాభిరాముడై,

రావణాసురుని నిగ్రహించాడు. రామావతారంలో చేసినంత రాక్షస సంహారం ఏ ఇతరావతారంలోనూ చెయ్యలేదు. కొన్ని కోట్లమంది రాక్షసులను తెగటార్చాడు. ఆయన బాలకాండలో చెప్పుకున్నారు మిగిలిన అవతారాలకూ రామావతారానికీ తేడా ఒకటి ఉంటుంది. మిగిలిన అవతారాలలో స్వామి ఆవిర్భావం జరిగి లోకాలను పీడిస్తున్న రాక్షసులను సంహరిస్తాడు. త్రేతాయుగంలో మానవులను కించపరచి మాట్లాడారు. రావణాసురుడు మనుష్యులు నన్నేం చెయ్యగలరని వరంలో కోరుకోవడం మానేసాడు. మనుష్యుల కీర్తిప్రతిష్ఠలు ఆవిష్కరించి మానవత్వం గొప్పతనం చాటి చెప్పడానికి

**దశవర్ష సహస్రాణి దశ వర్ష శతాని చ**
**రామో రాజ్య ముపాసిత్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి ॥**

బాలకాండలో పదకొండు వేల సం॥ లు ఈ భూమిని పరిపాలిస్తానని చెప్పారు. ఆయన పరిపాలిస్తే తప్ప మళ్ళీ మనుష్యులు ఎలా ప్రవర్తించాలో తెలియని రీతిలో రావణాసురుడు భూమండలాన్ని పాడు చేసేసాడు. అటువంటి భూమిని ఉద్ధరించి సక్రమమార్గంలో పెట్టడానికి అన్ని సం॥ లు రాముడు రాజ్యం చెయ్యవలసి వచ్చింది. అంత గొప్పది రామావతారం.

ద్వాపరయుగంలో పరిపూర్ణావతారమైన కృష్ణపరమాత్మగా వచ్చాడు. ఆ అవతారంలో తాను చేసిన దుష్ట శిక్షణ కొంత అర్జునుని వెనుక తాను ఉండి, అర్జునుడు చేసినట్లుగా కనపడేటట్లుగా ప్రవర్తింపచేసి నిగ్రహింప చేసిన రాక్షసులు కొన్ని కోట్లమందిని, కురుక్షేత్ర యుద్ధంలో ఎంతోమంది దానవులను కండకావరంతో భగవంతుని

# శృంగేరి జగద్గురు వైభవం

ప్రవచనం

## బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు శర్మ



# శృంగేరి జగద్గురు వైభవం

**యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత**
**అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం ॥**

ఎప్పుడెప్పుడు ధర్మానికి ఇబ్బంది కలుగుతుందో అప్పుడు ధర్మాన్ని నిల బెట్టడానికి నేను అవతారం స్వీకరిస్తానని ద్వాపరయుగంలో కృష్ణభగవానుడు ప్రతిజ్ఞ చేసాడు. ద్వాపర యుగం తరవాత వచ్చినది కలియుగం. ద్వాపర యుగంలో ధర్మానికి హాని చేసే వాళ్ళు ఎవరు అన్నది ఉపాధి ద్వారా గుర్తించడం తేలిక. రాక్షసుల ఉపాధి వేరుగా ఉండేది. మనుష్యుల ఉపాధి వేరుగా ఉండేది. ప్రహ్లాదుని వంటి వారికి మినహాయింపు. రాక్షస శరీరంతో ఉన్నవారు ధర్మానికి ఇబ్బంది కలిగిస్తారు. కాబట్టి గుర్తుపట్టి సంహరించడం తేలిక. వారిని సంహరించి ధర్మాన్ని నిలబెట్టకలిగారు. కలియుగంలో రాక్షసులకు వేరు ఉపాధి లేదు. రాక్షసులు ఎక్కడ ఉంటారు. అని అడిగితే కలిపురుషుడు ప్రవర్తిస్తున్న విశేషాన్ని పురస్కరించుకుని మనుష్యుల మనసులలోనే రాక్షసులు ఉంటారు. ఏ మనుష్యుని ప్రవర్తన రాక్షసత్వంతో కూడుకుని ఉంటుందో ఆ మనుష్యులందరినీ సంహరించవలసి ఉంటుంది. పరీక్షిత్ మహారాజు కలి పురుషునకు ఇచ్చిన ఐదు స్థానాలకు మరి ఐదు

స్థానాలు ఏర్పడి లోకం అంతటా కలి విజృంభణం ఉన్న సందర్భం. పాపం చేసిన వాళ్ళను, ధర్మానికి విఘ్నం కలిగిస్తున్న వాళ్ళను నేను సంహారం చేస్తానని పరమేశ్వరుడు అవతారం స్వీకారం చేస్తే కలియుగంలో ఎంత మందిని మిగల్చాలి? ఎంత మందిని తెగటార్చాలి? కృష్ణ పరమాత్మ చేసిన ప్రతిజ్ఞ ఆయనకే ఇబ్బందికరం అవుతుంది. శివ కేశవుల మధ్య ఏ విధమైన భేదం లేదు కనక మనుష్యుల మనసులలో తిష్ఠ వేసి కూర్చున్న రాక్షసత్వాన్ని బోధ చేత తరిమి కొట్టి మనుష్యుడు మనుష్యుడుగా బతకగలగడానికి, శరీరంతో ఉత్కృష్ట కర్మ చేసి మళ్ళీ పుట్టవలసిన అవసరం లేని పునరావృత్తిరహిత శాశ్వత శివసాయుజ్య స్థితిని పొందడానికి, పరమశివుడు శంకర భగవత్పాదులుగా ఈ భూమి మీద అవతరించాడు. ఆయన వచ్చేసరికి కలిపురుషుని విజృంభణం చేత సనాతనమైన ధర్మానికి ప్రమాణమైన వేదం ప్రామాణ్యం సన్నగిల్లి అనేక వాదనలు ప్రబలి పోయాయి. అటువంటి సందర్భంలో పరమ శివుడు శంకరాచార్యుడిగా అవతార స్వీకారం చేసాడు. కృష్ణుడు, పరమశివుడు జ్ఞానం అందిస్తారు.

**కృష్ణమ్ వందే జగద్గురుమ్** పరమ శివునికి సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమామ్ అస్మదాచార్య పర్యంతామ్ వందే గురు పరంపరామ్. దక్షిణా మూర్తి స్వరూపంగా మౌన ప్రబోధం చేస్తారు.

**“మౌనవ్యాఖ్యాప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానం**
**వర్షిష్ఠాంతే వసదృష్టిగణైః రావృతం బ్రహ్మ నిష్ఠైః**
**ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్రమానందరూపం**
**స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే”**

ఆ రోజులలో కైలాస పర్వతం మీద వట వృక్షం కింద చిన్ముద్రలో కూర్చుంటే దాని సంకేతం ఏమి అన్నది ఆశ్రయించిన సనక సనందాది మహర్షులకు అవగతం అయి జ్ఞానం ఆవిర్భవించింది. కానీ కలియుగంలో ఎక్కడో కైలాస పర్వతం మీద పరమ శివుడు చిన్ముద్ర పడితే అజ్ఞానం తొలగడానికి జ్ఞానం కలగడానికి అంత అవకాశం ఉండదు. కనక పరమేశ్వరుడే బయలుదేరి ఈ భూమండలం అంతా పర్యటించి అజ్ఞానం తొలగదోసి, జ్ఞానం వెలుతురు మనకి అందించి, వేద ప్రామాణ్యాన్ని నిలపెట్టి సనాతన ధర్మవైభవం నిలపెట్టడం కోసం, సత్యం ఆవిష్కరించడం కోసం ఆదిశంకరులుగా అవతార స్వీకారం చేసాడు. అలా స్వీకరించిన వారు పార్వతీ శంకరుల సమాగమ స్వరూపులు. పరమ శివుడు ఎప్పుడూ తనలో తాను రమిస్తూ ఉంటాడు. ఆయన తప్ప వేరు పదార్థం లేదు. పూర్తి అద్వైతస్థితి అంటే రెండు కానిది ఒక్కటి అయినది. ఆ ఒక్కటి తప్ప వేరొకటి లేనప్పుడు భయపడ వలసిన పనిలేదు. ఇంకొకటి ఉన్నదని అనిపించినప్పుడు భయం వేస్తుంది. ఉన్నది ఒకటే అయితే భయానికి అవకాశం లేదు. అటువంటి అద్వైత స్థితిలో 'అహం బ్రహ్మాస్మి' అన్న స్థితిలో రమించిపోయే శివ స్వరూపం మహాపురుషులు శంకరాచార్యులవారే. శక్తి స్వరూపిణి అయిన పార్వతీదేవి తనలో తాను రమిస్తూ ఒక చోట ఉండిపోవడం కుదరదు. శక్తి అన్న మాట ఎప్పుడు వాడినా కదులుతుంది అని గుర్తు. శక్తి హీనమైతే కదల లేదు అని గుర్తు. ఒక వ్యక్తి తిరుగుతుంటే ఆరోగ్యంగా ఉన్నాడని గుర్తు. కదలలేక మంచాన పడిపోతే శక్తిహీనుడైనాడని గుర్తు. శక్తి అంటే కదలాలి. శివుడు అంటే తనలో తాను రమించాలి. తనలో తాను రమించే జ్ఞాన స్వరూపుడైన పరమశివునిగా భూమండలం అంతా పర్యటించి జ్ఞానబోధ

చేయగలిగిన ఆచార్యపురుషుడిగా ఏక కాలంలో పార్వతీపరమేశ్వరుల ఇద్దరి సమాగమస్వరూపంగా శంకరులు ఈ భూమండలం మీద అవతరించారు. వైశాఖ శుక్లపంచమి నాడు అవతరించి తాను ఒక్కడే సత్యదండాన్ని పట్టుకుని అవైదికమైన వాదనలను ఖండించారు. ఖండించడానికి ముందు అవతలివారు చెప్పేది వినాలి. శంకరులు తాను చెప్పిన అద్వైతం తప్ప మిగిలిన సిద్ధాంతాలను ఖండించారు అని చాలామందిలో ఒక అపోహ ఉంటుంది. శంకరుల జీవితం పరిశీలిస్తే ఆ మాట ఎంత తప్పో అర్థమవుతుంది. ఏ వాదనలోనయినా పటిమతో కూడిన మంచి విషయం ఉంటే దానిని పరమ ఆదర బుద్ధితో స్వీకరించారు. ఆయన ఏ వాదాన్ని మతాన్ని తరిమి కొట్టలేదు. శంకరులు ప్రశ్నించినప్పుడు ఆయన అడిగిన ప్రశ్నలకు నిలబడలేనివి. ఆయన ఆవిష్కరించిన సత్యాన్ని తన ధర్మంలో ఉన్నదని నిరూపించుకోలేని బౌద్ధమతం వంటివి ఈ దేశాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయాయి. ఏ వాదాన్ని ఆసాంతం ఖండించి, ఎందుకు పనికి రాని వాదన అనే మౌఢ్యమైన సిద్ధాంతంలో ఎన్నడూ కూర్చున్న వారు కాదాయన. విశాల హృదయులైన శంకరభగవత్పాదులు సత్యదండం చేత పట్టుకుని 32 సం॥లు ఈ భారతదేశం అంతా పర్యటించి ప్రతిచోటుకు వెళ్ళి అవైదికవాదనలు జాగర్తగా విని అందులో ఉన్న వేద విరుద్ధమైన అంశం ఎందుచేత ఉద్ధరణ యోగ్యమైనది కాదో, సనాతన ధర్మంలో ప్రతిపాదింపబడిన విషయాలు ఎందుచేత ఉద్ధరణకు హేతువులో, సనాతన ధర్మం ఎంత పరిపూర్ణత కలిగి ఉంటుందో నిరూపించిన మహా పురుషులు. ఒక్క సనాతన ధర్మానికే గొప్పతనం ఉన్నది. ఏ భూమికలోని వాడైనా ఉద్ధరణ పొందడానికి కావలసిన మార్గం మూసుకు పోయిన ధర్మం కానిది

# విషయసూచిక

# దశావతారాలు–వైశిష్ట్యం

దశావతారాలు అన్న మాటని కొంచెం జాగ్రత్తగా అర్థం చేసుకోగలిగితే పరమేశ్వరుడు అవతారాలు ఎందుకు స్వీకరిస్తాడు, దశావతారాలు అని పది అవతారాలు ఎందుకు విశిష్టతను పొందాయి? అన్న విషయం మీద మనకు ఒక సంగ్రహమైన అవగాహన ఏర్పడుతుంది. తార అన్న మాటకి వ్యతిరేకపదం అవతార. తార అంటే నక్షత్రం కాదు. తార అంటే ముత్యం. ఎంత నైర్మల్యంతో, మలినం లేకుండా శుద్ధమైనదిగా ఉంటుందో అంత శుద్ధమైనది అని ఒక అర్థం. తరింపచేసేది కాబట్టి తార అని రెండవ అర్థం.

తరించుట అంటే దాటిపోవుట. ఒక ఏరు అడ్డంగా ప్రవహిస్తుంటే ఇవతలి ఒడ్డునుండి అవతలి వేపునకు వెళితే దాటిపోయాడు అంటారు. ఆ మాట నిజజీవితంలో సంసారసాగరాన్ని తరించుట అని అన్వయం అవుతుంది. సంసారం అంటే జనన మరణ రూపమైన చక్రం. దానికే సంసారం అని పేరు. సంసారం అంటే భార్యాబిడ్డలు అనే లౌకికమైన అర్థం స్వీకరించకూడదు. జనన మరణ చక్రంలో తిరిగే ప్రక్రియకు సంసారమని పేరు. అటువంటి స్థితి నించి అవతలి ఒడ్డునకు చేరుకోవడమంటే భగవంతుని చేరుకోవడం. మళ్ళీ పుట్టవలసిన అవసరంలేక చివరిసారిగా శరీరం విడిచి పెట్టడం. అలా విడిచి పెట్టాలి అంటే 84 లక్షల జీవరాశులలో ఎవరికీ సాధ్యం కాదు. ఒక్క మనుష్యప్రాణికే సాధ్యం. ఎందువల్ల అంటే అలా దాటి వెళ్ళడానికి ఒక తెప్ప అవసరం. తరించుట దాటుట

అన్నప్పుడు మధ్యలో ఎడతెరపిలేని జనన మరణ చక్రం అనే ప్రవాహం అడ్డు ఉన్నది.

**పునరపి జననం పునరపి మరణమ్**
**పునరపి జననీ జఠరే శయనమ్**
**ఇహ సంసారే బహు దుస్తారే**
**కృపయా పారే పాహి మురారే.**

అంటారు భజగోవిందంలో. అటువంటి ప్రవాహం అడ్డు వచ్చినప్పుడు దాటాలి అంటే పడవ దగ్గర ఉండాలి. పడవ దగ్గర ఉండటం ఒక ఎత్తు, పడవ దగ్గర ఉన్నాకూడా భోగం కోసం వాడుకుని ఏటిని దాటడానికి ఇష్టపడకుండా ఉండిపోయే మోహబుద్ధి ఒక ఎత్తు. కొంతమంది చీకటి పడి ప్రదోషవేళ అవుతుండగా ఏటికి ఆవలి వొడ్డున ఆడుకుంటున్నారు. ఇంతలో ఒక వ్యక్తి వచ్చి "ఏటికి ఆవలి ఒడ్డున వాన పడి చాలా పెద్ద వరద వస్తుంది. మీరు తొందరగా ఏటిని దాటి ఆవలి ఒడ్డుకి వెళ్ళిపోతే సురక్షితంగా గ్రామం చేరుకుంటారు. తొందరగా దాటకపోతే ప్రవాహం పల్లం కనక ఇటువస్తే రాత్రి వేళ దారి తెలీక అందులో కొట్టుకుపోతారు. దాటెయ్యండి" అన్నాడు. తొందరగా దాటెయ్యండి అన్నప్పుడు వాళ్ళకి ఉన్న ఉపకరణం వాళ్ళు వాడుకోవాలి. పడవ పట్టుకుని ఏటిని దాటి ఆవలి ఒడ్డుకు వెళ్ళిపోవాలి. పడవ ఉన్నా అది అక్కడే పెట్టి ఆయన అలాగే చెపుతాడు ఆడుకుందామని అనుకుంటే ఆట అనబడే మోహంలో వాళ్ళు చిక్కి ఉండగా ప్రవాహం వచ్చేస్తుంది. పడవలు కూడా కొట్టుకుని వెళ్ళిపోతే ఇంక నిరాధారం. దాటటానికి ఏమీ అవకాశం ఉండదు. ఈత రావడం అది తరవాత, పక్కన పెట్టాలి.

లౌకికంగా పడవ ఉపకరణం. అది కొట్టుకుని పోయాక ఏమీ చెయ్యలేరు. వేదాంతంలో సాంసారికజీవనం ఊహ చేసినప్పుడు ఏటిని దాటడానికి ఇవ్వబడిన గొప్ప ఉపకరణం, పెట్టుబడి శరీరం. వ్యాపారస్థుడు ఏదైనా వ్యాపారం చేసేటప్పుడు తన దగ్గర దాచుకున్న ద్రవ్యం పెట్టుబడిగా పెట్టి వ్యాపారం చేసి బాగా లాభాలు సంపాదించుకున్నట్లే పరమేశ్వరుడు ఆయనను చేరడానికి మనుష్యునికి ఇచ్చిన గొప్ప ఉపకరణం మనుష్యశరీరం. మిగిలిన ఉపకరణాలు దేనికీ పనికి రావు.

అవి పాపపుణ్యాలను అనుభవించడానికి పనికి వస్తాయి. భగవంతుణ్ణి చేరడానికి ఉపకరించవు. సూర్యకళామందిరంలో దశావతారవైభవం జరుగుతున్నదని తెలిసి బయట వర్షం పడుతున్నదని ఒకాయన దశావతారవైభవం వినడానికి రాక ఇందులోకి వచ్చి కూర్చుంటే, ఏ కారణానికి కూర్చున్నా ఆయనని ఏమీ అనరు. కూర్చోండి అంటారు. అదే ఒక కుక్క వస్తే బయటికి తరిమేస్తారు. ఉపాధియందు దోషం. కేవలం మనుష్య ఉపాధి మాత్రమే సంసారం అనే ప్రవాహం దాటడానికి ఉపకరిస్తుంది. ఈ శరీరం లోపలి బుద్ధితో భగవంతుణ్ణి తెలుసుకుని ఆయనకు సంబంధించిన కర్మలు భక్తితో చేసి, ఆ భక్తితో చేసిన కర్మల వలన కలిగిన ఆ జ్ఞానంతో మళ్ళీ పుట్టవలసిన అవసరం లేని మోక్షస్థితిని పొందవచ్చు. అది ఇతరమైన ఉపాధులకు పనికి రాదు. కాబట్టి తరింపచేసేదానిని తార అని పిలుస్తారు.

ప్రపంచంలో తరింపచేసేది ఏది? భగవంతుని నుండి విడిపోయిన వాడు మళ్ళీ భగవంతునిలో కలసిపోవడం లేదా తాను ఆత్మ అని ఎరుకలోకి రావడం తరించడం. ఈ తరింపచెయ్యగలవాడు పరమేశ్వరుడు ఒక్కడే. తార శబ్దం భగవంతునికి ఒక్కడికే అన్వయం అవుతుంది. భగవంతుడు ఎవరు? ఎక్కడ ఉంటాడు? ఆయన రూపం ఏమిటి అని అడిగితే ఎన్నో శ్లోకాలు మనవిచేసి ఆయన మెడలో పాములు వేసుకుంటాడు, చంద్రవంక ధరించి, పెద్ద జటాజూటంతో ఉంటాడు అని అంటే అది శివస్వరూపం అని చెప్పగలరు. పచ్చని పట్టుపుట్టం కట్టుకుని, మెడలో వనమాల, శంఖ, చక్ర, గదా, పద్మాలను పట్టుకుని, నీల మేఘశ్యాముడై ఉంటాడు అంటే విష్ణువు అంటారు. ఏ రూపం గురించిన శ్లోకాలను చెప్పి వివరణ చేస్తే ఆ రూపం భగవంతుడు అంటారు. ఇన్ని రూపాలు భగవంతునికి ఉంటాయా? ఇన్ని రూపాలలో ఏదో రూపం భగవంతుడా? అసలు భగవంతునికి రూపం లేదు కనక ఏదో రూపాన్ని పొందుతుంటాడా? ఏది నిజం? తార, అవతార వ్యతిరేకపదాలు అయితే తార అంటే పైన ఉన్నది. సంగీతం పాడేవాళ్ళు తారస్థాయి అంటారు అంటే పై స్థాయి. పైన అంటే ఎంత అనగా దాని వెలుతురు తప్ప, దాని రూపాన్ని స్పష్టంగా మన మాంసనేత్రం చూడలేదు.

# దేవీ నవరాత్రులు

**శ**రన్నవరాత్రులు శరద్ ఋతువు నందు మనం జరుపుకునే నవరాత్రులు కనుక ఆ పేరు వచ్చింది. ఆ నవరాత్రులకు ఖ్యాతి, పవిత్రత దేనివల్ల కలిగాయి? శరదృతువు నందు నల్లటి మేఘాలు ఉండవు. దూదిపింజలలా తెల్లటి మేఘాలు ఆకాశమంతా ఆవరించి అత్యంతవేగంగా వెళ్ళిపోతుంటాయి. జగత్తుకి మేఘ స్వరూపం చెయ్యవలసిన ఉపకారం శ్రావణ, భాద్రపద మాసాలలో విశేషమైన వర్షాలు పడటమనే రూపంలో పూర్తయిపోతుంది. తమ దగ్గర ఉన్నదంతా వర్షించి వెళ్ళిపోతున్న మేఘాలను చూసి ఒక నమస్కారం చేస్తాం. మీదంతా మాకిచ్చి మా అభ్యున్నతిని అపేక్షించి మేం కృతజ్ఞత చెప్పామా, చెప్పలేదా? అన్నది కూడా చూసుకోకుండా, ఎక్కడో సముద్రంలో ఉన్న ఉప్పు నీటిని తాగి చల్లటి నీటిని మాయందు వర్షించి మీరు నిరాధారమైన ఆకాశంలో వెళ్ళిపోతున్నారు. మాకు దాహార్తిని తీర్చి పాడిపంటలను పొంది సమృద్ధిగా ఉండేటట్లుగా అనుగ్రహించిన మేఘస్వరూపమా! నీకు నమస్కారం– అని శరత్కాలంలో దూదిపింజల వంటి మేఘాల ముద్దలకు నమస్కారం చేస్తాం.

శరత్కాలం ఆకాశమంతా తెల్లటి మబ్బులతో ఉంటుంది. ఆ కాలంలో చంద్రునికి పరిణతిచంద్రుడు అనిపేరు. శరత్కాలంలో తెలుపుదనం ఎక్కువ. చంద్రబింబంలో నుంచి వచ్చే కాంతి విశేషంగా ఉంటుంది. ఆకాశమంతా తెల్లటి చీర కట్టుకున్నదా అన్నట్లుగా తెల్లటి మబ్బులు గుంపులు గుంపులుగా ఉంటాయి. శారదాదేవి కూడా తెల్లగా ఉంటుంది. మనకి శాస్త్రంలో ఒక

గమ్మత్తయిన అనుబంధం చెపుతారు. మనకి ఉంది ఒక్క పరబ్రహ్మమే. మూడు కార్యాలు నిర్వహించేటప్పుడు మూడుగా భాసిస్తూ ఉంటారు తప్ప దాని అర్థం ముగ్గురున్నారని కాదు. ఉన్నదొక్కటే పదార్థం.

**ఏకస్త్వమేవ బహుధా భవ భాసి**
**నిశ్శంకధీః వృషభకేతన మల్లినాథ ।**
**శ్రీభ్రామరీ ప్రియ సుఖాశ్రయ లోకనాథ**
**శ్రీమల్లికార్జున విభో తవ సుప్రభాతమ్ ॥**

ఉన్న ఒక్కటే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులని సృష్టి చేసేటప్పుడు బ్రహ్మగా, స్థితి చేసేటప్పుడు విష్ణువుగా, లయకారుడిగా రుద్రునివలె మూడుగా కనపడే ఒక్క పదార్థం.

**మూడు మూర్తులకును మూడు లోకములకు,**
**మూడు కాలములకు మూలమగుచు,**
**భేదమగుచు దుదినభేదమై యొప్పారు,**
**బ్రహ్మమనగ నీవ ఫాలనయన.** **(భాగ. 8 -227)**

ఆ ఉన్న ఒక్క పదార్థమే మూడుగా కనపడుతుంటుంది అంటారు పోతన. మూడుగా కనపడే పదార్థం ముగ్గురు శక్తులను కలిగి ఉంటుంది. ఉన్న ఒక్క పరబ్రహ్మశక్తే మూడుగా భాసిస్తుంది. బ్రహ్మగారి శక్తిగా ఉన్నప్పుడు సరస్వతి, విష్ణుశక్తిగా ప్రకాశించినప్పుడు లక్ష్మి, రుద్రశక్తిగా ప్రకాశించినప్పుడు ఆమే రుద్రాణి. మూడుగా కనపడుతుంది. బ్రహ్మగారి చెల్లెలు లక్ష్మీదేవి. విష్ణువు చెల్లెలు పార్వతీదేవి. శంకరుని చెల్లెలు సరస్వతీదేవి. గమ్మత్తయిన సంబంధాన్ని ఆవిష్కరిస్తారు. ఇలా ఎందుకు వచ్చింది? అంటే ఒకాయన చమత్కారంగా బొత్తిగా ఇద్దరైతే కుండ మార్పిడి అయిపోతుందని, అందుకని ముగ్గురు మూర్తులుగా ఉంటారు అని అన్నారు. ముగ్గురు మూర్తులలో బ్రహ్మగారి చెల్లెలు అయిన లక్ష్మి నారాయణుని స్వీకరించింది. నారాయణుని చెల్లెలు నారాయణి పరమశివుణ్ణి స్వీకరించింది. పరమశివుని చెల్లెలు సరస్వతిని బ్రహ్మ స్వీకరించారు. సరస్వతి, శంకరుడు

తెలుపు. సరస్వతే శారద. ఇద్దరూ తెలుపు. ఈ కాలం తెలుపు. ఆకాశం తెలుపు. చంద్రుడు తెలుపు. ఈ తెలుపు శాంతికీ, కాంతికీ ప్రతీక అయి భాసిస్తూ ఉంటుంది. పరమశివుడు దక్షిణామూర్తిగా కూర్చుని ఉంటే ఎటువంటి స్వరూపంతో ఉంటాడో సరస్వతి శారదాస్వరూపంగా అలాగే ఉంటుంది. దక్షిణామూర్తిగా పరమశివుడు కూర్చుంటే జ్ఞానానికి ఆలవాలం.

**మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానం ।**
**వర్షిష్ఠాంతే వసదృష్టిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః ॥**
**ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్ర మానందరూపం।**
**స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే ॥**

**వటవిటపి సమీపే భూమి భాగే నిషణ్ణం**
**సకలముని జనానాం జ్ఞానదాతార మారాత్ ।**
**త్రిభువనగురు మీశం దక్షిణామూర్తిదేవం**
**జననమరణదుఃఖ చ్ఛేదదక్షం నమామి ॥** **(శ్రీ దక్షిణామూర్తి స్తోత్రం)**

అని పిలుస్తాం. ఆయన జనన మరణ దుఃఖాలనుంచి పైకి ఎత్తి శాశ్వతమయిన జ్ఞానమిచ్చి మళ్ళీ పుట్టవలసిన అవసరం లేని పునరావృత్తిరహిత శాశ్వతశివ సాయుజ్యస్థితిని ఇవ్వగలిగిన పరమాత్మ – పరమశివుడు. ఆయన చెల్లెలు శారద. దక్షిణామూర్తి స్వరూపంగా శంకరుడు ఏం చేస్తాడో సరస్వతీస్వరూపం కూడా అదే చేస్తుంది. శివుడు, శారద తెలుపు. దక్షిణామూర్తిగా చేతిలో పుస్తకం, జపమాల పట్టుకుంటాడు. ఆయనని,

**గురవే సర్వలోకానామ్ భిషజే భవరోగిణామ్ ।**
**నిధయే సర్వవిద్యానామ్ దక్షిణామూర్తయే నమః ॥**

శారదాదేవి కూడా అలాగే జపమాల, పుస్తకం పట్టుకుంటుంది. కాలడిలో అటువంటి మూర్తి ఉంటుంది. జపమాల, పుస్తకం జ్ఞానసిద్ధికి హేతువులుగా ఉంటాయి. మూకశంకరులు కామాక్షి అమ్మవారి మీద స్తోత్రం చేసారు. ఆమె ఇచ్చిన వాక్కు చేతనే అమ్మవారి మీద స్తోత్రం చేసారు. సహజంగా మాటలు

# దుర్గా వైభవం

Read Sample

75/-

బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు శర్మ

ప్రవచనం



# దుర్గా వైభవం

ప్రతి సంవత్సరం ఆశ్వయుజ మాసంలో వచ్చే శుక్ల పక్ష పాడ్యమి నుండి తొమ్మిది రోజులు చేసే ఉపాసనా కార్యక్రమానికి శారదా నవరాత్రులు అని ఋషులు పేరు పెట్టారు. ఈ నవరాత్రులు ఉపాసనాక్రమంలో అత్యంత ప్రధాన స్థానం వహిస్తాయి. మనం తరచుగా ఉపాసన అన్న మాటని వాడుతుంటాం. ఉపాసన అంటే దగ్గరగా కూర్చొనుట. ఎవరికి దగ్గరగా? అంటే తత్ పదార్థానికి దగ్గరగా ఉండుట. పరమేశ్వరుని దగ్గరకు చేరడానికి చేసే సాధనా క్రమానికి ఉపాసన అని పేరు.

ఆ క్రమంలో ఆశ్వయుజ మాసంలో వచ్చే మొదటి తొమ్మిది రోజులు చేసే ఉపాసన అత్యంత ప్రధానమైన ఉపాసన. మనకి 27 నక్షత్రాలు ఉన్నాయి. మొదటి అశ్వనీ నక్షత్రానికి అధిదేవతలు అశ్వనీ దేవతలు. చంద్రుడు అశ్వనీ నక్షత్రంతో కూడి ఉన్నప్పుడు వచ్చిన పౌర్ణమి కలిగిన మాసం కనుక ఆశ్వయుజమాసం మొదటి మాసం కావాలి. చాంద్రమాన ప్రకారం చైత్రమాసం మొదటి మాసం. 27 నక్షత్రాలలో మొదటి 13, వెనక 13 నక్షత్రాలను విడిచి పెట్టి మధ్యలో ఉన్న 14వ నక్షత్రమైన చిత్తా నక్షత్రంతో చంద్రుడు కూడుకున్న పౌర్ణమి ఉన్న మాసం కనక చైత్ర మాసం మొదటి మాసం అవుతుంది. ఉపాసనకు సంబంధించి ఆశ్వయుజ మాసం మొదటి మాసం అవుతుంది. భగవంతుణ్ణి చేరుకోవడానికి ప్రారంభం అక్కడ ఉంటుంది. ఆ మాసానికి అంత గొప్పతనం ఇచ్చి శారదా నవరాత్రులు అన్న పేరుతో తొమ్మిది రాత్రులు ఉపాసన చేస్తారు. దానికి ఒక్కటే ప్రధానమైన కారణం. ఈ మాసంలో మొదటగా ప్రారంభమయ్యే మొదటి తొమ్మిది రాత్రులు ఒక రోజుకి ప్రారంభంలో ఉండే తెల్లవారుజాము సమయం వంటివి. సూర్యోదయానికి 48 నిమిషాలకి ముందు ఉండే కాలాన్ని బ్రాహ్మీముహూర్త కాలం అంటారు. ఇది ఉపాసనకి పరమయోగ్యమైన కాలంగా నిర్ణయింపబడింది. ఉపాసనా క్రమంలో

ఉండే సంవత్సరమంతటినీ ఒక రోజుగా భావన చేస్తే తెల్లవారుజాము కాలం ఆశ్వయుజ మాసం వచ్చే పాడ్యమి నుండి నవమి వరకు ఉండే కాలం. ఆ తొమ్మిది రాత్రులను తెల్లవారుజాము కాలంగా పరిగణిస్తారు. ఒక సంవత్సరమంతటికీ శారదా నవరాత్రులే తెల్లవారుజాము కాలం. రోజు మొత్తానికి ఉపాసనకు అత్యంత యోగ్యమైన కాలం తెల్లవారుజామున సూర్యోదయానికి 48 నిమిషాలకి ముందు ఉండే కాలం. దానికి ఒక ప్రత్యేకమైన శక్తి ఉంటుంది కనుక దానిని ఉపాసనకు యోగ్యమంటారు.

మిగిలిన కాలం ఇంద్రియాలతో కలసి పైకి తిరిగే మనసు వశమవడం అంత తేలికయినది కాదు. తెల్లవారుజాముకాలంలో మనసు వెనకకి వెళ్ళి దాని మూలమైన ఆత్మ ఏది ఉన్నదో దానిలో ఒదిగిపోతుంది. ఒక రోజుకి తెల్లవారుజాము కాలం ఎంత గొప్పదో శారదా నవరాత్రుల కాలం అంత గొప్పది.

తొమ్మిది రోజుల క్రమాన్ని విడచి పెట్టకూడదు. అందరూ చేస్తారు. వ్యక్తిగతంగానూ చేస్తారు. దేవాలయాలలోనూ చేస్తారు, వీధి వీథిన దుర్గా అమ్మవారిని నిలబెట్టి వాయు ప్రతిష్ఠచేసి తొమ్మిది రోజులు అమ్మవారి ఉత్సవాలు చేసి పదవ రోజు విజయదశమి అన్న పేరుతో పండగ నిర్వహించి సాధారణంగా శాంతికర కల్యాణంతో పూర్తి చేసి అమ్మవారి మూర్తిని తీసుకుని వెళ్ళి నిమజ్జనం చేస్తుంటారు.

శారదానవరాత్రులు భారీ ఎత్తున ఎందుకు చేస్తారంటే దానికి ఒక ప్రధానమైన కారణం ఉన్నది. శరత్కాలం ప్రారంభమయినప్పుడు భాద్రపదమాసం కృష్ణపక్షంలో ఏకాదశి తిథి వెళ్ళిపోవడం ప్రారంభమయినప్పటినుండి ఆశ్వయుజమాస ప్రవేశమయినట్లు. కృష్ణపక్ష ఏకాదశి తరవాత మంచిపనులు చెయ్యడానికి అంగీకరించరు. భాద్రపద మాసం కృష్ణపక్ష పాడ్యమి నుంచి చెయ్యరు. పితృపక్షమైన తిథుల్లో శుభకార్యాలు చెయ్యరు. ప్రత్యేకించి ఆశ్వయుజ పాడ్యమి వచ్చేసరికి యమధర్మరాజుగారి ఒక కోర బయటికి రావడం ప్రారంభమవుతుంది. ఒక కోర ఆశ్వయుజమాస తిథి నుండి బయటికి వస్తే వేరొక కోర మళ్ళీ వసంత నవరాత్రులలో చైత్రమాసంలో వచ్చే శుక్లపక్ష పాడ్యమి

లగాయితూ బయటికి వస్తుంది. ఈ రెండు ఋతువులలో పాడ్యమి నుండి నవమి వరకు యమధర్మరాజుగారి కోరలు బయటికి వచ్చిన కారణం చేత ఈ ఋతువులో తొమ్మిది రాత్రులలో ఒక లక్షణం వుంటుంది. పరమ భయంకరమైన అంటువ్యాధులు ప్రబలుతాయి. శాస్త్రం అవి ఎంతో ప్రమాదమైనవని చెప్పింది. అది అంటుకున్న వ్యక్తి గ్రామానికి ఒకడు ఉన్నా ఊళ్ళోని వారందరూ ఇళ్ళు విడిచిపెట్టి పారిపోవలసినంత భయంకరమైన అంటువ్యాధులు ప్రబలే కాలం.

**ద్వావృతూ యమదంష్ట్రాఖ్యే నూనంసర్వ జనేష్వైః వసంత శారదా రాత్రౌ**

వసంత ఋతువులో, శరత్ ఋతువులో వచ్చే రెండు తొమ్మిది రాత్రులలో కూడా యముని కోర బయటికి వచ్చిన కారణం చేత అపార జననష్టం జరుగుతుందని శాస్త్రవాక్కు. శాస్త్రం ఏది చెప్పినా యథార్థమే చెపుతుంది. దీనిని పోగొట్టుకోవడానికి మార్గం ఎక్కడ ఉంటుందంటే ప్రకృతి స్వరూపమైన దుర్గాదేవి అమ్మవారిని తొమ్మిది రోజులపాటు పూజించి అమ్మవారి అనుగ్రహాన్ని పొందితే దేశమంతా సుభిక్షంగా, సస్యశ్యామలంగా ఉంటుంది. అంటువ్యాధుల బారిన పడి ఎన్నో వేలమంది పడిపోవలసిన అగత్యం ఏర్పడదని మనకు శాస్త్రం వివరిస్తుంది.

సర్వ జనులని పడగొట్టే భయంకరమైన యమదంష్ట్రలు రెండూ కూడా బయటికి వస్తాయి. అవి రాకుండా చెయ్యాలంటే ఉపాసనా మార్గంలో ఒకే ఒక్క ఆధారముంటుంది. అదే దుర్గాదేవి ఆరాధన. దుర్గ అని పేరు కలిగిన అమ్మవారి ఆరాధన ప్రకృతి అంతటికీ ఉపశాంతి కల్పిస్తుంది. జననష్టం జరగకుండా, చతుష్పాదులైన ప్రాణులకు నష్టం కలగకుండా లోకాన్ని సుభిక్షంగా ఉంచగలిగిన శక్తిని అనుగ్రహించగలిగిన పరదేవత స్వరూపం దుర్గమ్మ. అందువల్ల ఆమె ఆరాధన చేస్తారు.

భారతదేశమంతటా వాతావరణం ఒకలా ఉండదు. దక్షిణ భారతదేశంలో చలి ఒకలా ఉంటే ఉత్తర భారతదేశంలో చలి ఒళ్ళు కొయ్యబారిపోయేలా ఉంటుంది. విపరీతమైన వ్యత్యాసం ఉంటుంది. శరదృతువు ఆశ్వయుజమాస శుక్లపక్షంలో పాడ్యమి నుండి నవమి తిథి వరకు ప్రారంభకాలంలో మాత్రం భారతదేశమంతటా ఒకేలా ఉంటుంది. సర్వశుక్లా సరస్వతీ... తెల్లని కాంతి

కలిగిన లక్షణంతో సరస్వతీదేవి అనుగ్రహం ప్రస్ఫుటంగా ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ దేశంలో విశేషమైన పాండిత్యం కలిగిన వాళ్ళు ఒకప్పుడు కాశ్మీర దేశంలో పుట్టారు. అందువల్లనే సర్వజ్ఞపీఠం కాశ్మీర దేశంలో ఉండేది. ఇప్పటికీ పాక్ ఆక్రమిత కాశ్మీరంలో సర్వజ్ఞపీఠం, సరస్వతీ దేవాలయం ఉన్నాయని ప్రతీతి. అటువంటి ప్రాంతంలో పుట్టిన చాలామందిని కాశ్మీర పండితులు అనే పిలుస్తారు. అంత సరస్వతి అనుగ్రహం పొందిన కాశ్మీరు రాష్ట్రంలో సరస్వతీదేవి ఎంత తెల్లగా ఉంటుందని చెప్పబడినదో అంత తెల్లగా హిమవత్పర్వతమంతా మంచుతో కప్పబడి ఉంటుంది. కొద్ది వ్యత్యాసం తప్ప వాతావరణం ఒకేలా ఉంటుంది. దేశమంతా అమ్మవారి ఉపాసన తొమ్మిది రోజులు జరుగుతుంది.

విశేషమేమిటంటే తొమ్మిది రాత్రులు దుర్గనే ఉపాసన చేస్తారు. దుర్గని ఉపాసన చేసేటప్పుడు మొదటి మూడు రోజులు కాళీ స్వరూపంగా, మధ్యలోని మూడు రోజులు మహాలక్ష్మీ స్వరూపంగా, చివరి మూడు రోజులు సరస్వతీ స్వరూపంగా ఉపాసన చేస్తారు. అలా చేయడంలోని ఆంతర్యం మనుష్యుడు సహజంగా అనేకమైన వాసనలతో ఈ లోకంలోకి వస్తాడు. ఆ వాసనలను తొలగించగల శక్తి పేరు దుర్గ. సంప్రదాయజ్ఞులైన పెద్దలు 'దుర్గ' నామస్మరణ లేని రోజు ఉండకుండా చూసుకోవాలంటారు. ఒక్కసారి అయినా 'దుర్గాయై నమః' అనాలి లేదా కనీసం దుర్గా అని అయినా అనాలి. ఆంధ్రదేశంలో ఒకప్పుడు ప్రతి ఇంట్లో ఒక ఆడపిల్ల దుర్గ నామంతో ఉండేది. దుర్గ అన్న నామం ఉచ్చరించడం చేత అనేకమైన ఫలితాలు సంక్రమిస్తాయి. దుర్గ అన్న నామంలో 'ద' కారం చేత దైత్య అనగా రాక్షస ప్రవృత్తి నాశనమవుతుంది. అలా నాశనం అయిన కారణం చేత మనసులో సమాజాన్ని పాడుచేసి వక్రగతిలోకి తీసుకుని వెళ్ళాలనే ప్రబోధాలు ఉండవు. ఎందుచేత అంటే మిగిలిన యుగాలకు కలియుగానికి ఒక భేదం ఉంటుంది. మిగిలిన యుగాలలో రాక్షసులకు వేరు ఉపాధి ఉన్నది. వాళ్ళు రాక్షసులు అని గుర్తు పట్టవచ్చు. కలియుగంలో రాక్షసులకు వేరు ఉపాధి లేదు. చూడగానే రాక్షసుడు అని చెప్పడానికి ఉండదు.

మరి రాక్షసుడు ఎక్కడ ఉంటాడు? అంటే నరుడి హృదయంలోనే ఉంటాడు. రాక్షసులు మనసులలోనే ఉంటారు. 'దుర్గా' అని ఒక్కసారి ఉచ్చరిస్తే మనలోనే

# గోమాత వైభవం

ఇది ఆధ్యాత్మిక సంబంధ విషయం. లౌకికంగా కూడా తెలుసుకోవలసిన విషయం. మనకి లలితాసహస్రనామస్తోత్రంలో వశిన్యాది దేవతలు అమ్మవార్ని స్తోత్రం చేసినపుడు గోమాతా అని పిలిచారు. గోమాతా అని పిలిచినపుడు అసలు లలితాసహస్రనామ స్తోత్ర ప్రారంభం ఏ నామంతో? శ్రీమాతా అని. వశిన్యాది దేవతలు గోవుని పిలవటం లేదు. అమ్మవారిని పిలుస్తున్నారు. అమ్మవారి నామావళి చెపుతూ, అమ్మవారి గుణాలు ప్రకాశించిన విధం స్తోత్రం చేస్తున్నారు. ఆవిడ ముందే చేస్తున్నారు. ఆవిడ అంగీకరించింది ఆ స్తోత్రాన్ని. లలితాదేవి వంక చూసి వశిన్యాది దేవతలు అమ్మవార్ని గోమాతా అన్నారు. అంటే ఆవిడ తలవూపి అంగీకరించి అవును, నేను గోమాతనే అన్నది.

మీరు ఒక విషయాన్ని జాగ్రత్తగా పరిశీలించండి. పశువుల కోవలోకి వచ్చేది గోవు. ఆవు ఒక పశువు, అమ్మవారు జగజ్జనని. ఆవిడని గోమాత అని పిలిచారు. ఆవిడ అంగీకరించింది. కేవలం ఒక ఆవుని పూజించమన్న సందర్భంలో అన్న మాటా? అమ్మవారే గోవుగా ఉందని వాళ్ళు అంటున్నారా? వశిన్యాది దేవతలు ఆ స్తోత్రం చేసినపుడు అమ్మవారు అంగీకరించి ఉన్నది కనుక, కచ్చితంగా అమ్మవారే గోవుగా లోకంలో ఉంది. అందుకే వాళ్ళు గోవు అని విడిచి పెట్టలేదు. గోమాత అన్నారు. మీరిపుడు ఒక విషయాన్ని చాలా జాగ్రత్తగా పట్టుకునే ప్రయత్నం చేయండి. మాతా అన్న శబ్దం ఎవరి

పట్ల ఉపయోగింపబడుతుందంటే, శరీరంలో ఉండే రెండు అంగాలు ప్రత్యుత్పత్తి యందు అనగా ప్రధానంగా శిశువు శరీరపోషణయందు ఉపకరించగల్గిన దేహస్థితి గల్గిన ప్రాణిని మాతా అని పిలుస్తాం. ఒకటి – గర్భంలో బిడ్డను ధరించగలిగినదై ఉండాలి. రెండు – పుట్టిన శిశువుకు పాలివ్వగలిగి ఉండాలి. స్తన్యం ఉన్నదై ఉండాలి. శాస్త్రాలెంత గౌరవించాయంటే, మాతృత్వాన్ని – మగవాడు భగవంతుడి దగ్గరకు వెళ్ళి నమస్కరిస్తే సాష్టాంగనమస్కారం. ఎనిమిది అంగాలూ భూమికి తగలాలి. కానీ స్త్రీ నమస్కారం చేస్తే పంచాంగ నమస్కారం, సాష్టాంగనమస్కారం లేదు. వాళ్ళు భూమి మీద బోర్లాపడుకుని నమస్కారం చెయ్యడాన్ని శాస్త్రమంగీకరించలేదు. ఎందుకని అంటే నేల మీద పడి నమస్కారం చేయడం వినయమే అయినా, నేలమీద పడితే అది దూష్యమవుతుంది. ఒక పువ్వు పట్టుకుని ఈశ్వరుడికి ఆరాధన చేద్దామని అనుకుంటుంటే ఆ పువ్వు జారినేల మీద పడితే దాన్ని కొంచెం ప్రక్కన పెట్టాలి. పూజలో ఉపయోగించడం కుదరదు. భూమికి తగలడం మర్యాదతో కూడి చేసే నమస్కారమే అయినా, స్త్రీ విషయంలో శాస్త్రమెంత గౌరవంగా మాట్లాడిందీ అంటే ఆమె వక్షఃస్థలం, ఆమె కడుపు నేలమీద తాకక్కర్లేదు. ఎందువల్ల?

సృష్టి జరుగుతోంది అంటే స్త్రీ శరీరంలో ఉన్న వక్షఃస్థలం పోషిస్తోంది పాలిచ్చి. తల్లి కడుపు ఈ సృష్టి అంతా జరగడానికి గర్భాలయమై ఆధారమై ఉంది. ఈ శరీరాన్ని తల్లి తొమ్మిది నెలలు కడుపులో పెట్టుకుని భరించింది. ఏమీ చేతకాని స్థితిలో తల్లి పాలిచ్చిపెంచి పెద్దచేసింది. ఆ రెండు పనులూ తల్లి చేసి ఉండకపోతే ఈ శరీరం లేదు. సృష్టిలో ఎవరికైనా అంతేగదా. సృష్టి ఉంది అంటే స్త్రీ శరీరంలో ఉన్న ఆ రెండు అవయవాల వల్లే కదా అందుకే అంత గౌరవం ప్రకటించింది సనాతనధర్మం. అందుకే సనాతనధర్మంతో సమానంగా నిలబడగలిగిన స్థితి అంత పవిత్రమయినవి కనుక, జగత్తు సృష్టికి

ఆధార భూతమైనవి కనుక స్త్రీ వక్షఃస్థలం గానీ, కడుపుగానీ పరమేశ్వరుడికే నమస్కారం చేసినా భూమికి తగలనక్కర్లేదు అంది. అందువల్ల పంచాంగ నమస్కారం చేస్తే చాలు. మగవాడు కూడా పంచాంగనమస్కారం చేయవచ్చు. ఎపుడు చేయవచ్చు అంటే ప్రాంతం చాలా ఇరుకుగా ఉండి అక్కడ సాష్టాంగం చెయ్యడానికి వీలుకాకపోతే, గురువుగారు కనబడితే మాత్రం పంచాంగం చెయ్యడం శాస్త్రమంగీకరించదు. గురువుగారికి ఎప్పుడూ సాష్టాంగమే. గురువు ముగ్గురు మూర్తుల సమష్టి స్వరూపం.

**గురుః బ్రహ్మ గురుః విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**
**గురుసాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః**

గురువుకు మాత్రం ఎప్పుడూ సాష్టాంగనమస్కారమే చెయ్యాలి. ఇంత పరమపవిత్రంగా సనాతనధర్మం మాతృత్వాన్ని చూస్తుంది. అమ్మవారి వంక తిరిగి వశిన్యాది దేవతలు అన్నారు – అమ్మా, నువ్వు గోమాత అని ఇపుడు కేవలం పశుత్వాన్ని చెప్పటం లేదు. జాగ్రత్తగా గమనిస్తే చాలాపెద్ద పీట వేసి మాట్లాడుతున్నారు – గోస్వరూపంలో ఉన్న తల్లివి నువ్వు అన్నారు. ఎందుచేత? ప్రధానమయిన కారణం అమ్మ తన శరీరంలో ఉబికే పాలని కేవలం బిడ్డల పోషణ కొరకే వెచ్చిస్తుంది. అలాగే ఆవు కూడా కేవలం తన బిడ్డల కొరకే కాక మనకోసం, మనుష్యజాతి కొరకు వెచ్చిస్తుంది. ఆవు తన దూడకు సరిపడేటన్ని పాలను మాత్రమే చేపదు. కావాలని ఎక్కువ పాలు చేపుతుంది. ఎవరికొరకు? ముందు తన దూడ వచ్చి పొదుగును తాకితే విడిచిపెడుతుంది. తరువాత మనుషులు పితికేసుకున్నా బాధపడదు. వాళ్ళకోసమే ఈ పాలు తయారు చేసానంటుంది. తల్లి ఎలా పాలిచ్చి పోషిస్తానంటుందో, అలా పాలిచ్చి పోషించే స్వరూపం ఉన్న అమ్మవారి స్వరూపమే గోవు.

కాబట్టి లోకంలో మనకి తల్లులు నాలుగు స్వరూపాలుగా ఉంటారని చెపుతుంది శాస్త్రం. అందులో ఒకటి జనకమాత. అంటే శరీరాన్ని ఇచ్చిన తల్లి. రెండవ వారు భూమాత. ఈ భూమి తల్లి. రెండవది శ్రీమాత. నాలుగవది గోమాత. అందుకనే నలుగురుగా ఉంటుంది. ఇందులో చాలా చాలా గమనించతగ్గ విషయమిటంటే వేదం ఒక ఆశ్చర్యకరమైన విషయాన్ని ప్రకటించింది. ఒక వస్తువుని దానం చేసారనుకోండి. ఒక పంచెల చాపు పట్టుకువెళ్ళి ఎవరికో దానం చేసారనుకోండి "ఇదం న మమ" అంటూ. మీరు ఒక పంచెల చాపు దానం చేసారని మీ ఖాతాలో వేస్తారు. రెండు పళ్ళు ఇచ్చారనుకోండి. మీ ఖాతాలో రెండు పళ్ళిచ్చారని వేస్తారు. ఒక ఆవుని ఇస్తే 1000 ఆవులు ఇచ్చారని ఖాతాలో వేస్తారు ఎందుచేత అంటే వేదం గోమాత విషయంలో అంత విశాలహృదయంతో మాట్లాడింది. మరి 1000 గోవులు ఇచ్చిన ఫలితం మీ ఖాతాలో వేశారనుకోండి. మరి పుచ్చుకున్నవాడి ఖాతాలో కూడా 1000 పుచ్చుకున్న ఫలితం పడుతుందా? కచ్చితంగా పడుతుంది. అన్ని గోవులు దానం పుచ్చుకున్నపుడు ఆయన తేజస్సు క్షీణిస్తుంది. కాబట్టి ఆయనెంత గాయత్రి చెయ్యాలి? లౌకికంగా చూసినపుడు వచ్చింది ఒక గోవు. కానీ ఆయన ఆధ్యాత్మికపు ఖాతాలో మాత్రం 1000 గోవులు దానం పట్టినట్టు వేస్తారు. వేదం అంది ఒక్క గోదానం పుచ్చుకున్నపుడు మాత్రం నీళ్ళు విడిచి పెట్టి గోదానాన్ని పుచ్చుకుంటే పుచ్చుకున్న ఉత్తరక్షణంలో అక్కడ ఉండకుండా పక్కకివెళ్ళి కొంతసేపు ఒక మంత్రం జపం చేయమని చెప్పింది. ఆ జపం చేస్తే తప్ప వేయి గోవులు పుచ్చుకున్న స్థితిపోదు. ఆ మంత్రజపం చేస్తే ఒక్క గోవు పుచ్చుకున్న స్థితిని అతని ఖాతాలో వేస్తారు. మీకు మాత్రం 1000 గోవులు ఇచ్చినట్లు వేస్తారు.

**"ఏకాసిన సహస్రం మే కాంత్వా భూతాం ప్రతిగృహ్ణామి"**

# కార్తికమాస వైభవం

## కాలమాహాత్మ్యం

### కార్తిక మాసం

**'కాలోహి బలవాన్ కర్తా సతతం సుఖదుఃఖయోః**
**నరాణాం పరతంత్రాణాం పుణ్యపాపానుయోగతః'** (దేవీ భాగవతం)

కాలం అనంతం. నిరంతర ప్రవాహం మహాబలవత్తరం సనాతన ధర్మంలో కాలమే సమస్తమైనదిగా నిలబడుతుంది. అందుకే భగవద్గీతలో గీతాచార్యుడు **'కాలాత్ కలయికాం అహమ్'** అంటాడు. నేను భావస్వరూపంలో వుండి లెక్కలు కట్టుకుంటూ వుంటాను అంటాడు.

**భగవంతుడి లెక్కలు**

ఇవ్వాళ జీవుడు ఈ శరీరంలో వున్నాడు. గతంలో ఇదే జీవుడు ఏ శరీరంలో వున్నాడో తెలియదు. ఏదో శరీరంలో వుండి ఏదో తప్పిదం చేసాడు, ఏదో పాపం చేసాడు, పుణ్యం చేసాడు. ఆ పాపమైనా, పుణ్యమైనా అనుభవించే పోవాలి. పాపము అనుభవ స్వరూపంగా పోవటానికి దుఃఖము; అలాగే పుణ్యము అనుభవంగా పోవటానికి సుఖము, రెండింటికి లెక్క ఇవ్వాలి. వీడు గతంలో చేసిన పాపమెంత, పుణ్యమెంత? ఎంత సుఖపెట్టవచ్చు? ఎంత దుఃఖపెట్టవచ్చు? ఇది లెక్క కట్టగలిగినవాడే లెక్కచెప్పి నీ ఎదుట నిలబడి నీ పాపపుణ్యముల ఫలితమును నీకివ్వడు. ఆయన వెనక నిలబడి గమ్మత్తుగా లెక్కకట్టి, ఆ లెక్క సారాంశంగా సుఖదుఃఖములనిస్తాడు. ఆ పరమేశ్వరుని మనం పట్టుకొని నిలదీయడానికి ఆయన మన కన్నుల ఎదుట కనబడే వాడు కాడు. మాంస నేత్రములకు గోచరము కాడు. కాబట్టి ఈశ్వరుణ్ణి నిలబెట్టి ప్రశ్న చేయడం సాధ్యంకాదు. ఆయన ఏ ఫలితాన్నిచ్చాడో ఆ ఫలితాన్ని పరతంత్రులమై అనుభవించటమొక్కటే మనం చేయగలిగిన పని. అదికూడా భక్తితో కూడుకున్నది.

దుఃఖం వచ్చిందనుకోండి, నాకు భగవంతుడు దుఃఖమిచ్చాడని బాధ పడకుండా, నేను ఏ జన్మలోనో ఏదో పాపం చేసి వుంటాను, దానికిప్పుడు దుఃఖమిచ్చాడు. ఈశ్వరా! ఇప్పుడు దుఃఖం ఎంత బాధాకరమో తెలుసుకున్నాను కాబట్టి దుఃఖమునకు కారణమైన పాపము నాచేత చేయ బడకుండుగాక. కాబట్టి నాకు దైవమునందు పూనిక కలుగుగాక! అని భగవంతునికి నమస్కరించగలిగిన ప్రజ్ఞ అంకురించటం నిజమైన పరిణతి కలిగిన భక్తిని పొంది వుండటం. అందుకే ధూర్జటి

**'నిను సేవింపగ నాపదల్పొడమనీ, నిత్యోత్సవం బబ్బనీ**
**జనమాత్రుండననీ, మహాత్ముడననీ, సంసారమోహంబు పై**
**కొననీ, జ్ఞానముగల్గనీ, గ్రహగతుల్ కుందింపనీ, మేలు వ**
**చ్చినరానీ, యవినాకు భూషణములే శ్రీకాళహస్తీశ్వరా!'** (కాళ.శ.-12)

అని అంటాడు. అలా వుండగలిగిన పరిణతి ఈశ్వరుని కృపచేత మాత్రమే సంభవమవుతుంది.

అటువంటి కాలము పరమ బలవత్తరమైన స్వరూపం. అది ఈశ్వర స్వరూపంగా వుండి, ఈ సుఖదుఃఖముల రూపములలో పాపపుణ్యములనుభవించేసి, దానివలన కంటికి కనబడని ఈశ్వరుని ప్రజ్ఞని గుర్తెరిగి ఆయన పాదముల యందు నిరతిశయమైన భక్తిని పెంపొందింప జేసుకుని కృతార్థుడు కాగలిగిన వ్యక్తి ధన్యాత్ముడు.

అందుచేతనే మనకి కాలాన్ని విభాగం చేసారు ఋషులు. అది ఋషుల దార్శనికత. అందుకే మనం పుట్టుకతోనే ఋషికి ఋణపడిపోయాము. ఋషి ఋణం తీరాలంటే ఋషిప్రోక్తమైన వాఙ్మయాన్ని చదువుకోవాలి. కనీసంలో కనీసం నాకు చదువుకోవడం రాదండీ అన్నా, ఇంట్లో శ్రీరామాయణాది గ్రంథములుండాలి. చదవలేకపోయినా కనీసం ఒక్క పువ్వు ఆ పుస్తకం మీద వెయ్యగలగాలి. అవి చదవనినాడు ఋషి ఋణం తీరదు. ఆ ఋషి కాలాన్ని విభాగం చేసాడు. విభాగం చేసి ఏ సమయమందు మనం పరమేశ్వరానుగ్రహం పొందడానికి కాలం మనకు యోగ్యమైన రీతిలో వుంటుందో నిర్ణయం చేసాడు. అందుకే దక్షిణాయనం, ఉత్తరాయనం.

ఎప్పుడైనాసరే నడక అనేది కుంటినడక కాకుండా వుండాలంటే రెండుకాళ్ళ మీద నడవాలి. రెండు కాళ్ళమీద నడిచినట్టే కాలముకూడా ఒక సంవత్సరాన్ని ప్రమాణంగా తీసుకున్నపుడు ఉత్తరాయనం, దక్షిణాయనం అనబడే పేర్లతో రెండు కాళ్ళతో

నడుస్తుంది. ఇందులో దక్షిణాయన పుణ్యకాలం, ఉత్తరాయన పుణ్యకాలం అంటాము. యథార్థంగా పరిశీలన చేస్తే, దక్షిణాయనం తక్కువని, ఉత్తరాయనం ఎక్కువని భావన చేయకూడదు. తెలియక చాలామంది దక్షిణాయనంలో చనిపోతే ఏదో ఉపద్రవం వచ్చేసిందనుకుంటారు. అజ్ఞాని అయినవాడూ, ఎక్కువ భక్తి తత్పరత లేనివాడు ఎప్పుడు పోయినా ఒక్కటే.

శంకరాచార్యులవారు బ్రహ్మసూత్రాల భాష్యం చేస్తూ దక్షిణాయనం అనే మాటకు వుండే అర్థమేమిటో వ్యాఖ్యానం చేసారు. కొన్ని కొన్ని లోకముల మీదుగా జీవుడు ప్రయాణం చేసి బ్రహ్మలోకంలో కొంతకాలం వాసం చేసి మహాప్రళయమందు ఈశ్వరునియందు ఐక్యమైపోయే స్థితి దక్షిణాయనం. అంతేగాని దక్షిణాయనం అంటే ఏదో జీవుడు పాడైపోయే కాలం కాదు. యథార్థమునకు ఉత్తరాయనం కన్నా దక్షిణాయనమే చాలా గొప్పది. ఎందుచేత దక్షిణాయనం చాలా గొప్పది? అంటే దక్షిణాయనం అంతా కూడా మనకి ఉపాసనా సంబంధమై వుంటుంది. మనం పరమేశ్వరుని ఆరాధన చేయటానికి యోగ్యమైన కాలం అంతా కూడా కేవలముగా దక్షిణాయనంలోనే సంభవిస్తుంది. ఉత్తరాయన పుణ్యకాలంలో నిజానికి దక్షిణాయన పుణ్యకాలంలో వచ్చే గొప్ప తిథులు రావు. అందుకే ఉపాసన అంతా దక్షిణాయనం. దక్షిణాయనంలో చనిపోయాడండీ అంటే 'అయ్యో!' అని ఎందుకంటారంటే ఉపాసన చేసుకోగలిగిన కాలం వచ్చినపుడు వుండకుండా శరీరం విడిచిపెట్టేసుకున్నాడ్రా, ఇప్పుడా శరీరం లేకుండా స్నానం చేస్తాడా, దీపం పెడతాడా? చేసుకోలేడు. దక్షిణాయనాన్ని పోగొట్టుకున్నాడని బాధపడతారు తప్ప, దక్షిణాయనంలో చనిపోవడం వల్ల వచ్చే ప్రమాదం ఏదో వుందని భావించకూడదు. కాబట్టి దక్షిణాయనం అంతా ఉపాసనా కాలం. ఉపాసనాకాలం కాబట్టే ఆషాఢమాసంలో వచ్చే గురుపౌర్ణమి, శ్రావణమాసంలో వచ్చే వరలక్ష్మీవ్రతం, ఇలా పరమ ప్రఖ్యాతమైన తిథులన్నీ కూడా దక్షిణాయనంలోనే నడుస్తాయి. ఈ దక్షిణాయనంలో వచ్చే తిథుల ప్రత్యేకత మనకి దేశము కాలము – ఈ రెండింటిచేత పవిత్రమై వుంటుంది. ఒక్కొక్కసారి ఒక్కొక్క ప్రాంతంలో వున్న కారణంచేత మీకు ప్రత్యేకమైన ఫలితమొకటి సమకూడుతుంది.

ఉదాహరణకి నేను గంగానదిలో స్నానం చేసాననుకోండి. గంగానదిలో స్నానం మిగిలిన ఏ నదీస్నానం కన్నా గొప్పదే! స్కాందపురాణంలో అగస్త్యమహర్షితో

మాట్లాడుతూ సుబ్రహ్మణ్యుడంటాడు : మిగిలిన అన్ని క్షేత్రములను ఎందుకు దర్శనము చేయాలి? మిగిలిన అన్ని తీర్థములందు అన్నిరోజులయందు దేనికి స్నానం చెయ్యాలి అంటే - వీటిలో స్నానంచేస్తే, ఇన్ని క్షేత్రాలను దర్శిస్తే, కాశీపట్టణ ప్రవేశానికి, విశ్వనాథుని సేవించటానికి, గంగాస్నానం చెయ్యడానికి అధికారం పొందడం కోసం! అంటే కాశీపట్టణ ప్రవేశం అంత గొప్పది. గంగాస్నానం అంత గొప్పది. తెలిసో తెలియకో కాశీపట్టణ ప్రవేశం చేసాడు. అంతే పూర్వజన్మ పుణ్యం లేకుండా అలా కాశీపట్టణ ప్రవేశం చెయ్యరు. గంగాస్నానం చెయ్యరు. ఆ దేశమునకు ఆ ప్రాంతమునకు ఒక ప్రఖ్యాతి వుంది. అలాగే కాలమునకు కూడా ఒక పవిత్రత వుంటుంది. ఒక్కొక్క కాలమందు మీరు చేసిన పని మీకు విశేషమైన ఆంతర్యం సిద్ధింపజేస్తుంది. మీరు ఎన్నో నెలలు, వారాలు, రోజులు చదివినప్పటికి మీ పరీక్ష మాత్రం గంటో, గంటన్నరో, మూడుగంటలో ఉంటుంది. ఆ సమయంలో మీరు రాసిందానికే ప్రాముఖ్యం. మీ భవిష్యత్తు దానిమీదే ఆధారపడి ఉంటుంది. అట్లాగే కార్తికమాసానికి కూడా ప్రాధాన్యం ఉంటుంది. కాబట్టి ఋషి ఈశ్వరవాక్కును ఆధారం చేసుకుని నిర్ణయం చేసాడు.

దక్షిణాయనం ఉపాసనకాలం. అందునా ప్రత్యేకించి కార్తికమాసం చాలా విశేషమైన నెలగా చెప్పబడుతుంది. కారణం మనకి ఏదైనా చాలా గొప్ప విషయాన్ని నిర్మాణం చేస్తే పైకి కనబడే విషయానికి ఆధార భూతమైనది కంటికి కనబడకుండా ఒకటుంటుంది. పెద్ద సౌధాన్ని నిర్మాణం చేసాననుకోండి నేను, ఆ సౌధాన్నంతటినీ మోస్తున్న పునాది భూమి లోపలుంటుంది. అది కనబడదు. కానీ ఆ పునాదిమీదే సౌధం వుంటుంది. ఒక మహావృక్షమొకటి కనబడిందనుకోండి. అబ్బ శాఖోపశాఖలుగా ఎంత పెద్ద చెట్టండీ అన్నాననుకోండి, నిజానికి ఆ చెట్టును నిలబెడుతున్నటువంటి వేళ్ళు భూమిలోపల వుండి దాన్ని పట్టుకుని వున్నాయి. అలాగే కార్తికమాస వైశిష్ట్యమేమిటో చెప్పడానికి మనకి ఋషి దాన్ని ఆశ్వయుజ మాసంలో వచ్చే చిట్టచివరి తిథి దగ్గరికి వచ్చేటప్పటికే కార్తికమాసం వైభవాన్ని ఆవిష్కరించాడు. ఇది ఒక ప్రక్రియ. ఒక సౌధ నిర్మాణం చేసేటప్పుడు పునాది ముందు వేసినట్టే, ఒక మహత్తరమైన విషయాన్ని చెప్పేటప్పుడు ముందే దాన్ని గురించి ప్రారంభం చేస్తారు. మీకందుకే శ్రీరామాయణంలో సుందరకాండ ప్రారంభం చేసేముందు వాల్మీకి మహర్షి కిష్కింధకాండ పూర్తిచేసి చిట్టచివర ఒక శ్లోకాన్ని వ్రాసాడు. అసలు సుందరకాండ గొప్పతనమంతా అంతో ఇంతో కిష్కింధకాండ చిట్టచివరి శ్లోకంలో చెప్తారు.

# సనాతన ధర్మం

**మ**నం సంకల్పం అని ఒకటి చేస్తుంటాం. ప్రతి రోజూ పూజ చేసేటప్పుడు దేశకాలసంకీర్తనమూ అంటారు. అందులో భరత వర్షే, భరత ఖండే అని చెప్తుంటాం. దేశమూ, కాలమూ ఈ రెండూ ప్రధానంగా దేనికొరకు అంటే ధర్మానుష్ఠానం కొరకు. ధర్మం ఎవరు నిర్వర్తించాలి? ఒక్క మనుష్యునికే ధర్మం. ఆ ధర్మం నిరంతరమూ మారిపోతూ ఉంటుంది. మిగిలిన వాటికన్నిటికీ ఒకటే ధర్మం. తిర్యక్కులకు ప్రత్యేకించి పశువులకూ, పక్షులకూ అన్నిటికీ ఒకటే ధర్మం, పశుధర్మం అంటారు. పశుధర్మ నమో ప్రీతిం అంటాడు దేవీభాగవతంలో వ్యాస భగవానుడు. పశువులకి ధర్మం ఒక్కటే. ఆకలేస్తే తినెయ్యడం, దాహమేస్తే తాగడం, కామం కలిగితే సంభోగించడం, నిద్రవస్తే పడుకోవడం, కోపమొస్తే కుమ్మడం, అంతే వాటి ధర్మం తప్ప వాటికి ఇతరవిధాలైన ధర్మం లేదు.

ఇతరవిధాలైన ధర్మం అన్న మాటను మీరు కొంచెం జాగ్రత్తగా పరిశీలన చెయ్యాలి. ఏ ధర్మాన్ని అనుష్ఠించిన కారణంచేత ఇంక మళ్ళీ శరీరంలోకి రావలసిన అవసరంలేని స్థితిని పొందుతాడో, అటువంటి ధర్మాచరణం చెయ్యవలసిన స్థితి కానీ, అధికారం కానీ, ఇతరప్రాణులకు కల్పించబడలేదు. ధర్మానుష్ఠానమంతా ఎవరి కొరకు అంటే కేవలం మనుష్యుని కొరకు. మనుష్యజాతి అంతా ఎక్కడుంటుందీ అంటే ఒక్క భూలోకంలోనే. భూలోకానికి పైన ఊర్ధ్వలోకాలు. భూలోకానికి కింద అధోలోకాలు. మధ్యలో ఉండేది భూలోకం. మళ్ళీ ఈ భూలోకానికంతటికీ కూడా ధర్మాచరణం కానీ, కర్మాచరణం కానీ, యజ్ఞయాగాది క్రతువులు నిర్వహించడం కానీ, అధికారం ఎక్కడున్నదీ అంటే ఒక్క భరతవర్షే, భరతఖండే, జంబూద్వీపే. వేదం స్పష్టంగా ఆ మాటలు చెప్పింది. ఇక్కడ మాత్రమే కర్మానుష్ఠానం,

ఇక్కడ మాత్రమే యజ్ఞయాగాది క్రతువులు. తప్ప ఇతరమైన ప్రదేశాల యందు భూమండలంలో ఈ క్రతువులు చెయ్యడానికి యోగ్యమైన ప్రదేశాలు లేవు. మీరు నన్నొక మాట అడగవచ్చు. ఈ భూమి అంతా కూడా పరమేశ్వరునిచేత సృష్టించబడినదే కదా అటువంటప్పుడు కొంత భాగంలో మాత్రమే యజ్ఞయాగాది క్రతువులు జరిగి, భూమండలమంతా మనుష్యజాతి ఉన్నప్పటికీ, ఈ అధికారం ఇతరప్రదేశాలలో ఎందుకు కల్పించబడలేదు అని. నేను మీతో ఒక్క మాట మనవి చేస్తాను. కొద్ది కొద్దిగా పరిశీలనం చెయ్యండి.

నాకు చాలా నీరసంగా ఉందనుకోండి. చేతులు లాగేస్తూ, కాళ్ళు లాగేస్తూ చాలా మగతగా ఉంది. ఇప్పుడు ఆ నీరసం తగ్గడానికి నేను కాళ్ళకీ, చేతులకీ అన్నం పులుముకుంటానా? కడుపులోకి అన్నం తీసుకుంటానా? కడుపులోకి అన్నంతింటే శరీరమంతా శక్తి ప్రసరిస్తుంది. మీ ఊరికంతటికీ కావలసిన విద్యుత్తు– ఒక చోట విద్యుత్ గృహం ఉంటుంది ఈ ఊరికి చివరలో, పవర్ హౌస్ అంటుంటారు. అక్కడ నుంచి శక్తి ప్రసారమవుతుంది. అన్నిచోట్లకీ విద్యుత్తు వస్తోంది. అలాగే మనుష్య శరీరంలో కడుపులోకి తీసుకున్న అన్నం పచనమై, జీర్ణమై అందులో నుండి ఉద్భవించిన శక్తి శరీరానికంతటికీ అందుతోందా అందట్లేదా, అలాగే భరతవర్షే, భరతఖండే, జంబూద్వీపే. ఇక్కడ చేసిన కర్మానుష్ఠానం, ఇక్కడ చేసే యజ్ఞయాగాది క్రతువులు, ఇక్కడ చేసే 'ధర్మాచరణాల వల్ల ప్రపంచంలో ఉన్న మనుష్యజాతి అంతా ఉద్ధరించబడుతూ ఉంటుంది. అంత గొప్ప అధికారం ఇవ్వబడిన ప్రాంతం భూమండలంలో ఇదొక్కటే.'

మీరు చూడండి – ప్రత్యేకించి ఫ్లాట్స్‌లో ఉన్నవాళ్ళకి బాగా తెలుస్తుంది. ఇదేనండీ నా ఫ్లాట్ ఏరియా అంటాడు. స్తంభాలు వేసి చదునుగా ఉంటుందంతే. అప్పటికింకా గోడలు పెట్టరు. ఆయనే నిర్ణయించుకుంటాడు. ఇదిగో, ఇక్కడొక పడక గది పెట్టుకుంటాను, ఇక్కడ పూజ గది పెట్టుకుంటాను, ఇక్కడ మరుగుదొడ్డి కట్టుకుంటానంటాడు. అంతకుముందు అదంతా సమతలంగా ఒక్కలాగే ఉంది. కానీ ఆయనే గోడలు పెట్టి ఇక్కడ మరుగుదొడ్డి అన్నాడు, ఇక్కడ పూజ గది అన్నాడు, ఇక్కడ వంట గది అన్నాడు, ఇక్కడ పడక గది అన్నాడు. ఒకసారి కట్టేసిన తరువాత ఇక మరుగుదొడ్డిలో భగవత్సంబంధమైన కార్యక్రమం ఏమైనా

చేస్తామా? చెయ్యం. పడక గదిలో చేస్తామా? చెయ్యం. ఒక్క పూజ గదిలోనే చేస్తాము. అలాగే ప్రపంచానికంతటికీ పూజగది ఏదీ అంటే ఒక్క భరతఖండే అంటే ఇక్కడే. అందుకే ఏది భరతవర్షం అని అడిగారు. హిమాలయ పర్వతాలకి దక్షిణాన, దక్షిణసముద్రానికి ఉత్తరాన ఉన్న భూభాగమేదో అది మాత్రమే. ఇక్కడ కృష్ణ జింకలు తిరిగాయి అన్నారు. కృష్ణ జింకలు ఎక్కడ తిరుగుతాయో, ఏది హిమవత్పర్వతాలకి దక్షిణాన ఉందో, ఏది దక్షిణసముద్రానికి ఉత్తరాన ఉందో, ఆ భూభాగం మాత్రమే ధర్మానుష్ఠానానికీ, యజ్ఞయాగాది క్రతువులకూ యోగ్యమైన భూమి.

యజ్ఞయాగాది క్రతువుల వల్ల ఉపయోగమేమిటని మీరొక మాట అడగచ్చు. యజ్ఞం అగ్నిసంబంధం. యజ్ఞంలో అగ్నిని ఉంచి దాని ద్వారా హవిస్సులు ఇస్తారు. హవిస్సులు తినడానికి దేవతలు వస్తారు. దేవతలు వచ్చి నిలబడే ప్రాంతం, కూర్చునే ప్రాంతం, ఆహారం తీసుకునే ప్రాంతం ఈ భూమండలమే. అందుకే మనుష్యజాతికి ఏ ఇతరమైన ప్రాణులకూ లేని విశేషమైన శక్తి ఒకటి ఉంది. దేవతలుగా ఉన్నారనుకోండి. **క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి**– కొంతకాలం పుణ్యమైపోయిన తరువాత ఆ దేవతలు మళ్ళీ భూమి మీద పడిపోతారు. భూమి మీద పుట్టిన వ్యక్తి సరైన కర్మానుష్ఠానం చేసి, ధర్మాన్ని పట్టుకుని, ఆచారాన్ని పట్టుకుని ఇక పుట్టవలసిన అవసరం లేకుండా మోక్షాన్ని పొందగలడు, తానే దేవత కాగలడు.

శ్రీరామాయణంలో ఒక **శతక్రతు నివాసేనం నాగరాజస్య మూర్ధ్వనే** అంటారు హనుమ. నూరు యజ్ఞాలు చేసిన వ్యక్తి దేవేంద్రుడై ఐరావతం మీద కూర్చుంటాడు. నూరు యజ్ఞాలు ఎక్కడ చెయ్యాలి? ఇక్కడే యజ్ఞం చెయ్యాలి. అంటే యజ్ఞం చేసి దేవేంద్రుడు కూడా కాగలిగిన అధికారం ఏ దేశంలో పొందవచ్చా అంటే, దేశమంటే నా ఉద్దేశ్యం ప్రదేశం అని– ఒక్క భరతఖండంలో మాత్రమే అది సంభవం. ఇక్కడే దేవతలొచ్చి అన్నం తింటారు. ఇక్కడే దేవతలు సంతృప్తి చెంది సమస్త మనుష్యజాతికీ, ఇతరప్రాణులకూ కావలసిన అన్నాన్ని కల్పిస్తారు. అంటే వర్షాన్ని కురిపిస్తారు. అంటే ఆ వర్షాన్ని ఆధారం చేసుకుని పంటలు పండి, నీళ్ళు దొరికి శం చతుష్పదే, శం ద్విపదే అంటారు. అంటే కేవలం మనుష్యులే కాదు,

రెండు కాళ్ళున్న మనుష్యుల నుంచి నాలుగు కాళ్ళున్న జంతువుల నుండి అన్నీ సంతోషంగా ఉండడానికి కావలసిన వ్యవస్థ ఎక్కడ ఏర్పాటు చెయ్యబడిందీ అంటే, ఒక్క భరతవర్షమూ, భరతఖండమూ ఇక్కడే. అందుకే ఇక్కడ కర్మానుష్ఠానం చేసినవాడు ఇంద్రుడు కాగలడు, దేవత కాగలడు. ఇక్కడ కర్మానుష్ఠానం చేసి భక్తితో కూడిన కర్మాచరణం చేత ప్రీతి చెందిన భగవంతునిచేత అనుగ్రహించబడిన జ్ఞానం వల్ల, ఇక మళ్ళీ పుట్టవలసిన అవసరం లేకుండా పునరావృత్తిరహిత శాశ్వత శివసాయుజ్యస్థితిని పొందగలడు. కాదు. ఇంత గొప్ప ప్రదేశంలో పుట్టి కర్మాచరణం చెయ్యడానికీ, ఆచారకాండ పాటించడానికీ కావలసిన యోగ్యతను పొంది కూడా ఏ విధమైన కర్మాచరణం చెయ్యకుండా తిర్యక్కుగా వెళ్ళిపోగలడు. తిర్యక్కంటే భూమికి అడ్డంగా పుట్టి అడ్డంగా పెరుగుతుంది. అంటే దాని వెన్నుపాము అడ్డంగా ఉంటుంది. అడ్డంగా ఉండి అడ్డదిడ్డంగా తిరిగే ప్రాణిగా మళ్ళీ కొన్ని కోట్ల జన్మలపాటు **పునరపి జననం, పునరపి మరణం, పునరపి జననీ జఠరేశయనమ్, ఇహ సంసారే, బహు దుస్సారే, కృపయా పారే పాహి మురారే,** అంటారు భజగోవిందంలో. అలా కొన్ని కోట్ల జన్మలపాటు తిర్యక్కుగా వెళ్ళిపోగలడు.

ఇక్కడకు వచ్చినవాడు ఎవడున్నాడో మనుష్యుడుగా పుట్టడం అంత గొప్ప విషయం. ఏ ఇతరప్రాణికీ లేని ప్రత్యేక అధికారం ఒక్క మనుష్యునికి మాత్రమే. ఆ మనుష్యుడు కూడా అన్ని చోట్లా పుట్టినవాళ్ళు యజ్ఞయాగాది క్రతువులు చెయ్యడానికి వీలులేదు. ఆ భూములు యజ్ఞయాగాది క్రతువులు చెయ్యడానికి యోగ్యం కావు. అటువంటి యజ్ఞయాగాది క్రతువులు చెయ్యడం కానీ, ఆచారకాండ పాటించడంకానీ, ధర్మానుష్ఠానం చెయ్యడం కానీ, పరమేశ్వరుణ్ణి చేరుకోవడం కానీ సంభవమవడానికి యోగ్యమైన ప్రదేశం ఒక్క భరతఖండమే. అటువంటి చోట పుట్టినవాడు, తననితాను తీర్చిదిద్దుకోవడానికి, తాను ఎలా బ్రతకాలన్నదాన్ని తెలుసుకుని ఉండడానికి, పరమేశ్వరుడు వేదం రూపంలో మనందరికీ కూడా శిష్టాచారాన్ని అనుగ్రహించాడు. ఎలా బ్రతకాలన్న ధర్మం చెప్పడానికి. ఎవరు చెప్పాలి? నేను చెప్తే ధర్మం కాదు, ఎవరో చెప్తే ధర్మం కాదు. ధర్మాన్ని చెప్పడానికి అధికారమున్నది ఒకే ఒక్కటి వేదం. వేదం ధర్మాన్ని చెప్తుందన్నమాటకి అర్థమేమంటే వేదం పరమేశ్వరప్రోక్తం. భగవంతుని చేత

# 1. శంకరుడి జననం

ద్వైతం అంటే రెండు. రెండు కానిది అద్వైతం. అంటే ఒకటి. మనకు ఉన్న జ్ఞానం ఒకటే. దీన్ని ప్రచారంలోకి తీసుకువచ్చిన మహానుభావుడు శంకరుడు. ఆయన కారణజన్ముడు. మన పుట్టుకకూ, మహానుభావుల పుట్టుకకు మధ్య వ్యత్యాసం ఉంటుంది. మనం గత జన్మలలో చేసిన పాపపుణ్యాల ఫలితాలను అనుభవించటం కోసం, ప్రాకృతమైన శరీరంలో ప్రవేశించి, ఆ కర్మ ఫలితాన్ని సుఖంగా, దుఃఖంగా అనుభవిస్తుంటాం. కానీ శంకరుడు సాక్షాత్తు సదాశివుడే. ''పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచ దుష్కృతాం ధర్మ సంస్థాపనార్థాయ, సంభవామి యుగే యుగే...'' అని భగవద్గీతలో కృష్ణ పరమాత్మ చెబుతాడు. ధర్మానికి ఇబ్బంది కలిగినప్పుడు, ధర్మ సంస్థాపన కోసం ఈశ్వరుడు రకరకాల అవతారాలలో ప్రత్యక్షమవుతాడు. కొన్ని సార్లు భక్తి జ్ఞాన వైరాగ్యాల ప్రబోధాలు చెయ్యడం కోసం కూడా అవతరిస్తాడు. అలా శంకరభగవానులు స్వీకరించిన ఉత్కృష్టమైన అవతారాలలో ఆదిశంకరుడి అవతారం కూడా ఒకటి.

శంకరుడు మాధవ మాసంలో జన్మించారు. వైశాఖ మాసానికి మాధవ మాసం అని పేరు. ఈ మాసానికి ఒక ప్రత్యేకత ఉంది. ఇది పృథ్వీ సంబంధమైన నెల. ఈ మాసంలో మల్లెపూలు, మామిడిపళ్లు వస్తాయి. ఒకటి సువాసనకు, మరొకటి మాధుర్యానికి గుర్తు. వైశాఖ మాసంలో జన్మించిన శంకరభగవత్పాదుల మాటలు కానీ, స్తోత్రాలు కానీ, ప్రకరణాలు కానీ, వ్యాఖ్యానాలు కానీ మధురాతి మధురాలు. మాటలో మాధుర్యం లేకపోతే దాన్ని ఆస్వాదించలేం. ఎంత గొప్ప విషయాన్నైనా కఠినంగా చెబితే వినటానికి ఎవరూ ఇష్టపడరు. మాట సరళంగా ఉండాలి. అవతలి వ్యక్తుల హృదయాన్ని ఆనందపరిచేలా ఉండాలి. మృదువుగా, మాధుర్యంగా ఉండాలి. వీటన్నింటిలోనూ శంకరుడికి తిరుగులేదు. దీన్ని మరో తాత్త్విక కోణం నుంచి కూడా మనం గమనించాలి. మల్లెపువ్వుకు వాసంతికా పుష్పం అని కూడా పేరు ఉంది. ఈ వాసంతికా పుష్పం అసురసంధ్యా కాలంలో బాగా విచ్చుకుంటుంది. మన దగ్గర ఉండే రకరకాల పువ్వులు– ఉదయాన్నే సూర్యకిరణాలు తగలగానే విచ్చుకుంటాయి. మల్లెపువ్వుకున్న గమ్మత్తేమిటంటే ఉదయం విచ్చుకోదు. అసురసంధ్యవేళలో అంటే చీకటి పడుతుంటే విచ్చుకొని సువాసననిస్తుంది. శంకరతత్త్వం కూడా అంతే.

శంకరభగవత్పాదులు జన్మించే ముందు దేశంలో అనేకమైన వాదాలున్నాయి. వేదం ఆధారంగా ఎవరికితోచిన సిద్ధాంతాలను వాళ్ళు ప్రతిపాదన చేసారు. అంటే ఆ సమయాన్ని అసురసంధ్యతో పోల్చవచ్చు. అప్పుడు వచ్చిన శంకరతత్త్వం– వాసంతికా పుష్పంలా తన సౌరభాలను వెదజల్లింది.

## జనన రహస్యం

కేరళ రాష్ట్రంలో కాలడి అనే ఒక గ్రామం ఉంది. దానిలో ఒక సద్బ్రాహ్మణుడు నివసిస్తూ ఉండేవాడు. ఆయన త్రికాల సంధ్యావందనం చేస్తూ ఉండేవాడు. సర్వ వేద వేదాంగాలు చదువుకున్నాడు. శాస్త్ర పురాణేతిహాసాలు ఆపోశన పట్టాడు. ఆయన కుమారుడు శివగురువు. ఆ బ్రాహ్మణుడు తన కుమారుడికి ఆ పేరు పెట్టడం వెనక ఒక కారణముంది. 'జ్ఞానాన్ని ఇచ్చేవాడు శంకరుడు. నా కుమారుడు గురు స్వరూపాన్ని పొంది ఈ జ్ఞానాన్ని అందరికీ పంచాలి. అజ్ఞానాన్ని తొలగించాలి' అనే కోరిక చేత ఆ బ్రాహ్మణుడు తన కుమారుడికి శివగురువు అనే పేరుపెట్టాడు. ఆ పిల్లవాడు పెరిగి పెద్దవాడయ్యాడు. అతను కూడా త్రికాల సంధ్యావందనం చేసేవాడు. వేదం చదువుకున్నాడు. శాస్త్రపురాణేతిహాసాలు క్షుణ్ణంగా అభ్యసించాడు. గురువు దగ్గర చాలాకాలం విద్యాభ్యాసం చేసాడు. ఆ రోజులలో విద్యాభ్యాసం చేయడమంటే కొంత సిలబస్ చదువుకోవటం కాదు. గురువులకి శుశ్రూష చేయాలి. నాలుగిళ్ళ ముందుకు వెళ్ళి భిక్ష పట్టుకురావాలి. గురుపత్నికి సేవలు చేయాలి. ఆ సమయంలో గురువు మేఘంలాంటివాడు. జ్ఞానాన్ని వర్షించేవాడు. శివగురు ఇవన్నీ చేశాడు. ఈ సేవలకు గురువుగారు సంతోషించారు. ''నాయనా! శివ గురూ! ఇంతకాలం మా దగ్గర శుశ్రూష చేసి విద్యాభ్యాసం చేసావు. నువ్వు నన్ను సేవించి అన్ని విద్యలూ నేర్చుకున్నావు. ఒక పరిణతిని పొందావు. ఇంక నువ్వు గృహస్థాశ్రమంలో ప్రవేశించాలి...'' అని ఆజ్ఞాపించాడు.

ఆ తర్వాత పెళ్లి ఎందుకు చేసుకోవాలో సవివరంగా చెప్పాడు. ''నాయనా! నువ్వు నా దగ్గర ఇంత విద్య నేర్చుకున్నావు.

నేర్చుకున్నందుకు నీ వల్ల సమాజానికి కొంత ప్రయోజనం కలగాలి. దేవ ఋణం. పితృ ఋణం, ఋషి ఋణం – ఈ మూడు ఋణాలు తీరాలి. ఇంటికెళ్ళి దేవతార్చనం చేసి దేవతలను ఆరాధించి, ఇతరులలో కూడా మతం వైభవాన్ని ప్రకాశింపచేస్తే దేవ ఋణం తీరుతుంది. బ్రాహ్మణుడవు కనుక వేదప్రచారం చేసి ఋషి ఋణం తీర్చుకో. నిన్ను నీ తండ్రిగారు కన్నట్టే నువ్వు కూడా ఒక కుమారునికి జన్మనివ్వాలి. దానికోసమని నువ్వు గృహస్థాశ్రమంలో ప్రవేశించాలి. అప్పుడు నీ పితృ ఋణం తీరుతుంది. అందువల్ల నువ్వు ఇంటికి వెళ్లి పెళ్లి చేసుకుని గృహస్థాశ్రమంలో ప్రవేశించు'' అని వివరించాడు. శివగురువు ఇంటికి వచ్చేశాడు. తన కుమారుని విద్యా వైభవాన్ని పరీక్షించి– శివగురువు తండ్రి పొంగిపోయాడు. ఉత్తమమైన వధువు కోసం ప్రయత్నాలు మొదలుపెట్టాడు.

సత్సంప్రదాయం ఏమంటే కొడుకుకి తగిన కోడలు కావాలనుకున్నవారు వెతికి ఆడపిల్లవారిని అడగాలి. అది తక్కువ తనం కాదు. శివగురువుకు మఘపండితుడి కుమార్తె ఆర్యాంబ పెళ్లికి సిద్ధంగా ఉందని తెలిసింది. ఆ ఆర్యాంబ సుగుణాల రాశి. శివగురువు తండ్రి మఘపండితుడి దగ్గరికి వెళ్ళి– ''అయ్యా! మీ పిల్లని మా అబ్బాయికిచ్చి పెళ్లి చేయండి...'' అని అడిగాడు. మఘపండితుడు అంగీకరించాడు. కాని పెళ్లి ఎక్కడ చేయాలనే విషయంపై విభేదాలు వచ్చాయి. మఘపండితుడు మా ఇంట్లోనే చేయాలన్నాడు. శివగురువు తండ్రి ఒప్పుకోలేదు. కన్యాదాత మాఇంటికే రావాలన్నాడు. ఇద్దరికీ కొంచెం పట్టుదలలు వచ్చాయి. శివగురువు తండ్రి ఆ సంబంధాన్ని

# శివ స్తోత్రం

**హరిః ఓమ్**

శివ అష్టోత్తర శతనామస్తోత్రం చాలా విశేషమైన స్తోత్రం. స్కాందపురాణంలో నారాయణుడు పార్వతీదేవికి ఉపదేశం చేసాడు. పరమశివునికి 63 లీలా మూర్తులు ఉన్నాయి. ఆ లీలామూర్తులలోని పదమూడవ మూర్తిని హరిహరమూర్తి అంటారు. శ్రీ మన్నారాయణుడు శివుని శరీరంలో సగభాగాన్ని పొందుతాడు. భేదం లేని రీతిలో శివకేశవులు కంసారి, కాలారీ ఇద్దరు ఒకే స్వరూపంగా ఉన్నవారు. అలా ఉన్న స్వరూపాన్ని హరిహరమూర్తి అని పిలుస్తారు. అలా ఎందుకు పిలుస్తారంటే దేనికది విడివడి ఉంటే గౌరవం లేదు. అది శాస్త్రం వైదికం కాదు. అనేకములుగా ఉన్నవి ఒకే సృష్టిలోనికి పర్యవసించి పోవడం సృష్టిలోని రహస్యం. సృష్టి ఒకటిగా, రెండుగా, మూడుగా, నాలుగుగా ఉండిపోతే అర్థం లేదు ఒకటిలోకి వెళ్ళిపోవాలి.

**"ఏకమేవఅద్వితీయంబ్రహ్మ"**

ఆ విధంగా దర్శనం జరగాలి. శ్రీమన్నారాయణుడు శివునిలోని అర్ధభాగాన్ని పొందాడు. వివాహ అనంతరం పార్వతీదేవి శ్రీమన్నారాయణుణ్ణి అడిగింది. శివునిలో అర్ధభాగాన్ని పొందడానికి ఏ విధమైన ప్రయత్నం చేయాలి అని. ఏది తెలుసుకోవడం వలన మీరు శరీరంలో అర్ధభాగాన్ని పొందారో అలా నేను కూడా సగ భాగాన్ని పొందడానికి ఉపదేశం చెయ్యవలసిందని అడిగింది. నారాయణునికి నారాయణికి అభేదం. ఆ సిద్ధాంతం చాలా విచిత్రంగా ఉంటుంది. శివుని భార్య శివాని. రుద్రుని భార్య రుద్రాణి. భైరవుని భార్య భైరవి. నారాయణి పేరు చెప్పినప్పుడు నారాయణుని భార్య అనకూడదు. నారాయణుని చెల్లెలు నారాయణి. వాళ్ళు ఇద్దరు ఒక్కలా ఉంటారు. ఇద్దరూ అలంకారప్రియులు, ఏవిధంగా నారాయణుడు

పరమశివుని శరీరంలో సగభాగాన్ని పొందాడో అదేవిధంగా నారాయణి అయిన అమ్మవారు పరమశివుని శరీరంలో సగభాగాన్ని పొందడానికి శ్రీమన్నారాయణుని వద్ద ఉపదేశం పొందినది. మనకు అనుమానం రావచ్చు, శ్రీమన్నారాయణుడు అప్పటికే సగం శరీరాన్ని పొందితే మిగిలిన శరీరం అమ్మవారు పొందితే మరి శివునికి అస్తిత్వం ఏది? ఒక సగం నారాయణుడు. ఒక సగం అమ్మవారు. శివుడు అలా ఎలా ఇస్తాడు? అంటే అది ఒక పదార్థంవలె శరీరాన్ని కత్తిపెట్టి కోసెయ్యడం కాదు. దాని వెనక ఒక ఆధ్యాత్మికమైన రహస్యం ఉంటుంది. ఎంతమంది ఎక్కినా పుష్పక విమానంలో ఒకరికి చోటు ఉంటుంది అంటారు. అలా ఎంతమంది పరమాత్మలోకి చేరుతున్నా పరమాత్మలో అవకాశం ఉంటుంది. మూర్తి స్వరూపం మారుతుంటుంది. అమ్మవారు పక్కన చేరితే 14 వది అయిన అర్ధనారీశ్వరస్వామి. 13వ స్వరూపం హరిహరమూర్తి. పరమశివునికి 63 లీలా మూర్తులు ఉన్నాయి. శివుని శరీరంలో అర్ధభాగాన్ని శ్రీమన్నారాయణుడు ఎలా పొందగలిగాడు? పరమశివుని శరీరంలో అర్ధభాగం కోరుకోవడానికి శ్రీమన్నారాయణునికి ఏమి అవసరం వచ్చింది? అని. కాళహస్తీశ్వరశతకంలో ధూర్జటి అంటాడు, అంత అందగాడా?

**"వన్నే యేనుగు తోలుదుప్పటము బు-వ్వాకాలకూటంబుచే**
**గిన్నే బ్రహ్మకపాల ముగ్రమగు భో- గే కంఠహారంబు మే**
**ల్నిన్నీలాగున నుంటయుం తెలిసియున్- నీపాదపద్మంబు చే-**
**ర్చెన్నారాయణుడెట్లు మానసము దా- శ్రీ కాళహస్తీశ్వరా!"**

ఆయన ఏమన్నా అందగాడా? ఏనుగుతోలు వలిచి పంచె కింద కట్టుకుంటాడు. అందరు పంచ భక్ష్యపరమాన్నాలు తింటారు. స్వామి హాలాహలాన్ని తింటాడు. పట్టుకున్న గిన్నె బ్రహ్మగారి కపాలము. మెడలో భయంకరమై బుసలు కొడుతున్న పాములు భూషణాలు. నువ్వు ఇలా ఉంటావని తెలిసి నారాయణుడు నీ శరీరంలో అర్ధభాగం కావాలని మనసు ఎలా పెట్టాడు అంటాడు. ఆయన చూస్తే

**మేఘశ్యామం పీతకౌశేయవాసం, శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగం।**
**పుణ్యో పేతం పుండరీకాయతాక్షమ్, వందే విష్ణుమ్ సర్వలోకైకనాథమ్ ॥**

అంత అందంగా ఉండే విష్ణువు పురుషుడిని ప్రేమించడం ఏమిటి? ధూర్జటి తెలియక అడిగాడా? దెప్పి పొడవడానికి అడిగాడా? అంటే తెలియక కాదు నిందా స్తుతి అంటారు. ఒక్కసారి నిందించినట్లు ఉంటుంది కానీ లోపల చేసేది స్తోత్రం. శ్రీమన్నారాయణుడు పరమశివునిలో అర్ధభాగాన్ని ఎలా పొందగలిగాడో పరమశివస్వరూపం ఎలా ఉంటుందో శంకర భగవత్పాదులు శివానందలహరిలో చెప్పారు.

**"బాణత్వంవృషభత్వమర్ధవపుషాభార్యాత్వమార్యాపతే!**
**ఘోణిత్వం సఖితా మృదంగవహతాచేత్యాదిరూపం దధౌ**
**త్వత్పాదే నయనార్పణం చ కృతవాన్త్వద్దేహ భాగో హరిః**
**పూజ్యాత్పూజ్యతర స్స ఏ వ హి నచే త్కో వా? తదన్యోఽధికః"**

ఒకసారి పరమశివుడు త్రిపురాసురులను సంహరించడానికి సృష్టిలో లేని బాణాన్ని పట్టుకోవలసి వచ్చింది. మేరు పర్వతాన్ని రథంగా చేసుకుని సూర్య చంద్రులను చక్రాలుగా చేసుకుని వేదమూలాన్ని గుర్రాలుగా కట్టుకుని బ్రహ్మగారిని సారథిగా పెట్టుకుని ప్రణవాన్ని చేతిలో కొరడాగా పట్టుకుని అంతకుముందు ఎవరూలేని రీతిలో దేవతా సార్వభౌముడై

**"శ్రీశైలే స్వర్ణశృంగే మణిగణరచితే కల్ప వృక్షాళి శీతే**
**స్ఫీతే సౌవర్ణ రత్న స్ఫురిత నవగృహే దివ్య పీఠే శుభార్హే**
**ఆసీన స్సోమ చూడ స్సకరుణ నయన స్సాంగన స్మేర వక్త్రః**
**శంభుశ్రీ భ్రామరీ ప్రకటిత విభవో దేవతాసార్వభౌమ! "**

ఆ రథాన్ని ఎక్కాడు. చేతిలో ధనుస్సు పట్టుకుని యుద్ధానికి వచ్చి మూడవ కంటి మంటతో త్రిపురాసురులను కాల్చపోతే అక్కడ ఉన్న శ్రీమన్నారాయణుడు, కాలాగ్ని బాణంగా మారి స్వామి చేతిలోకి వెళ్ళి ''స్వామీ మేము బాణం అవుతాము. మీశక్తిని బాణంలోకి ప్రవేశపెట్టవలసినది. బాణం విడచిపెడితే విడిచి పెట్టినవారి శక్తి బాణంలోకి వెడుతుంది. అందుచేత మీ శక్తి మాలోకి ప్రవేశించాలి. అందుకని మీ చేతితో బాణాన్ని పట్టుకుని సంధించ''మని అడిగారు. అడిగితే ఎంత గొప్పసేవ

చేసావు, ఇవ్వాళ నాచేతితో స్పృశించబడాలని బాణం అయ్యావు అని శంకరుడు సంతోషించాడు. వేదాలను గుఱ్ఱాలుగా కడితే లాగలేక కింద పడిపోయాయి. శంకరుడు అంటే సామాన్యమా? అప్పుడు శ్రీమన్నారాయణుడే వృషభమై రథాన్ని లాగాడు. వృషభమై తనని మోసి రథాన్ని లాగినందుకు శంకరుడు ప్రీతిచెందాడు. ఒకప్పుడు వరాహరూపాన్ని పొందాడు. స్వామి అరుణాచలేశ్వరుడిగా ఆవిర్భవిస్తే ఆ శివ లింగం ఆది కనిపెట్టడానికి భూమిని తవ్వుకుంటూ వెళ్ళాడు. సత్త్వగుణ ప్రధానుడు కనక లింగం యొక్క ఆదిని కనిపెట్టలేకపోయానని వెనకకు వచ్చేసాడు. బ్రహ్మ అబద్ధం చెప్పాడు. నువ్వు అబద్ధం ఆడలేదు. ఆ నాడు నా ఆద్యంతాలు తెలుసుకోవడానికి ఎంత ప్రయత్నం చేసావయ్యా! అని సంతోషించాడు. మోహినీ అవతారం స్వీకరించినప్పుడు జగత్తునంతటినీ తన ఆకర్షణలోకి తీసుకోవాలి. అంత సౌందర్యం శంకరుని అర్ధాంగి అయిన అమ్మవారి 'ఈమ్' బీజాక్షరం నుండి వస్తుంది. అమ్మవారి సౌందర్యం శ్రీమహా విష్ణువులోకి వెడితే మోహినీ అంశని పొందాడు. తనభార్యలా ఉన్నాడు అన్నారని చూడటానికి శంకరుడు వచ్చాడు. ఆంతరిక రహస్యం వేరు. అయ్యప్పస్వామి జననం జరిగితే తప్ప మహిషి సంహారం జరగదు. అందుకని శివుడు తండ్రిగా రావాలి. మోహినీ అవతారంలో విష్ణువు రావాలి. వారిద్దరికి కుమారుడు జన్మించాలి. తెలిసీ తెలియని వాళ్ళు విష్ణువు మోహినీ అవతారం ధరిస్తే శివుడు వెంటపడ్డాడు అంటుంటారు. అంత కామం ఉన్నవాడు అయితే మన్మథుని ఎందుకు కాలుస్తాడు. మహిషి మరణించాలి. అంతే కానీ కామానికి లొంగిపోయి వెంటపడ్డవాడు కాదు. మోహినీ అవతారంలో ఉన్న శ్రీమహావిష్ణువు వెనక భార్యగా పరిగణించి వెడితే తప్ప కుమారుడు జన్మించడు. అయ్యప్ప ధర్మశాస్త జననం జరగదు.

**హరిస్త్వా మారాధ్య ప్రణత సౌభాగ్యజననీ**

అంటారు శంకరులు. అమ్మ వారు ఆడిన నాటకం. మోహినీ అంశతో శంకరుని తృప్తిపరిచాడు స్వామి, ఎంత చక్కగా నాభార్య ఎలా ప్రవర్తిస్తుందో అలా ప్రవర్తించి నా మనసుని తృప్తి పరిచావు అన్నాడు. అది ఎవరు పడితే వారు చెయ్యదగిన విద్య కాదు. ఎందుచేత అనగా మనకి ఒక గొప్ప సంగీత విద్వాంసుడు

# సౌందర్యలహరి

బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు శర్మ

ప్రవచనం





# సౌందర్యలహరి

**ఆదిశంకరులు**

ఒకనాడు పరమశివుడు దక్షిణామూర్తిగా వచ్చారు.

**చిత్రం వట తరుర్మూలే వృద్ధాః శిష్యా గురూర్యువా**
**గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యోస్తు ఛిన్న సంశయః॥**

వారు మౌనంగా కూర్చుని, తనను బ్రహ్మజ్ఞానంకోసమని ఆశ్రయించిన సనక సనందనాది మహర్షులందరికీ కేవలం మౌనంతోటి వారి సంశయాలన్నింటినీ పోగొట్టి, బ్రహ్మజ్ఞానం కటాక్షించారు. అటువంటి సదాశివుడే ఒకనాడు ఆది శంకరులుగా అవతరించారు. ఒకనాడు వేదప్రమాణం ప్రశ్నింపబడితే, ఒక ఆడలేడి పదిహేను వేటకుక్కల మధ్యలో నిలబడిపోయినపుడు కన్నీరు కారుస్తూ ఎంత ఆర్తితో చూస్తుందో, అటువంటి పరిస్థితి ఈ దేశంలో ఉత్పన్నమయితే, మహానుభావుడు కైలాస శంకరుడు ఆదిశంకరుడిగా అవతరించి భారతదేశపు నలుచెరగులా పాదచారియై పర్యటించి వేదప్రమాణాన్ని ప్రశ్నించిన అనేకవాదాలను ఖండించి, మరల వేదాంతర్గతమయిన అద్వైత సిద్ధాంత వ్యాప్తిచేసి అహం బ్రహ్మాస్మి స్థాయికి ఎదిగిన మహాపురుషుడు. వారికి ఏమి అవసరం? వారు 'పశూనాం సర్వజ్ఞ ప్రథితకృపయా పాలయవిభో' అనవలసిన మనిషా శంకరభగవత్పాదులు? ఆయన –

**'దృశా ద్రాఘీయస్యా దరదలిత నీలోత్పలరుచా**
**దనీయాంసం దీనం స్నపయ కృపయా మా మపి శివే!'**

అంటారు సౌందర్యలహరిలో. 'అమ్మా, నీ కరుణార్ద్రపూరితమైన చూపులతో నన్ను తడిపివేయమ్మా' అంటారు. శంకరులెందుకు ఆ మాట అనడం? బ్రహ్మ జ్ఞానియై

నిరంతరజ్ఞానంచేత ఆత్మస్థితిలో రమించే మహాపురుషుడు ఆ మాట అనడమెందుకు? అంటే మనకోసమని మరొకమెట్టు క్రిందికిదిగి 'నేను ఆ మాట అనకపోతే వీరందరికీ ఎవరు దారి చూపుతారు?' అని, ఒకనాడు మౌనంగా కూర్చున్న సదాశివుడే నోరువిప్పి వ్యాఖ్యానం చేసిన శంకరులై వచ్చారు. ఒకనాడు కదలకుండా దక్షిణాభిముఖుడై కూర్చున్న సదాశివుడే ఆసేతుహిమాచలపర్యంతమూ పర్యటించిన శంకరుడై వచ్చారు.

## శ్రీఆదిశంకరులు

ఒకనాడు అమ్మవారు పక్కనలేకుండా కూర్చున్న సదాశివుడే – 'మాతృదేవోభవ పితృదేవోభవ ఆచార్యదేవోభవ' అనికదా – లోపల తనలోతాను రమించిపోయే నిర్గుణ పరబ్రహ్మస్వరూపం పొందిన సదాశివుడు, అమ్మవారి శక్తి తనలో కలవడం వలన ఆ మాతృదేవోభవ పితృదేవోభవ రెండూకలిసి ఆచార్యదేవోభవగా, శంకరభగవత్పాదులుగా పార్వతీపరమేశ్వరుల ఏకత్వం పొందిన స్వరూపం ఈ భూమి మీద నడయాడింది. ముప్ఫయిరెండు సంవత్సరాలు మాత్రమే ఈ పాంచ భౌతికశరీరంతో ఉన్న శంకరులు ఆ నాడు ఆవిష్కరించిన ప్రజ్ఞచేత వేదప్రమాణం నిలబడి, వేదానికి వ్యతిరేకమయిన వాదాలు ఈ దేశంలో ప్రవేశిస్తాయేమోనని భారతదేశం నాలుగు చెరగులా నాలుగు పీఠాలనుపెట్టి కాపు పెట్టారు.

| | | |
|---|---|---|
| గోవర్ధనపీఠం | – | జగన్నాథ్ |
| కాళికాపీఠం | – | ద్వారక |
| జ్యోతిపీఠం | – | బదరికాశ్రమం |
| శారదాపీఠం | – | శృంగగిరి |

తూర్పున జగన్నాథ్‌లో గోవర్ధనపీఠం, పడమర ద్వారకలో కాళికాపీఠం, ఉత్తరాన బదరికాశ్రమంలో జ్యోతిపీఠం, దక్షిణాన శృంగగిరిలో శారదాపీఠం – ఈ నాలుగు పీఠాలనుపెట్టి, వేదవ్యతిరేకమయిన వాదాలు మరల భారతగడ్డమీదకి రాకుండా కాపుపెట్టిన మహనీయులు శంకరులు. ఆ నాటినుంచి ఈ నాటివరకు వారు పెట్టిన ఆమ్నాయసంప్రదాయాలతో ఆ పీఠాలు నడుస్తూనే ఉన్నాయి. ఇది శంకరులు భారతజాతికి చేసిన అపారమయిన సేవ. దానికి ఏమి ఇచ్చి మనం ఋణం తీర్చుకోగలం? అనంతమయి అంతటా నిండిపోయిన గురువుకి పంచెలచాపు నేయగల సాలెవాడు ఇంకా ఈ భారతదేశంలో పుట్టలేదు. అందుకని రెండుచేతులూ ఎత్తి నమస్కరించడం తప్ప మనమేమీ చెయ్యలేము.

**జలజాతేక్షణు దోడితెచ్చితివి నా సందేశముం జెప్పి నన్**
**నిలువంబెట్టితి; నీ కృపం బ్రదికితిన్; నీయంత పుణ్యాత్మకుల్**
**గలరే? దీనికి నీకు బ్రత్యుపకృతిన్ గావింప నే నేర; నం**
**జలి గావించెద; భూసురాన్వయమణీ! సద్బంధుచింతామణీ!**

(భాగవతం – దశమస్కంధం–పూర్వభాగం– 1736)

అంటుంది రుక్మిణీదేవి. 'నీకు నేనేం చేయగలను? అందుకని రెండు చేతులూ మోడ్చి నీకు నమస్కరిస్తున్నాను' అంటుంది.

గురువుల పాదాలను స్మరించి నమస్కరించే పరమపవిత్రమయిన రోజు ఆషాఢపూర్ణిమ. ఆ రోజునే గురువులకు సంబంధించిన ఉత్సవాల రోజుగా మార్చారు. గురువులదంతా త్యాగమే. భారతీయసంప్రదాయంలో అందుకే గురువుకి అంత పెద్దపీట. ఇది ఇతరసంప్రదాయాలలో ఇతరమయిన రీతులలో ఎక్కడా కనపడదు. గురువు లేకపోతే ఏదీ భాసించదు. గురువు అనేది అంత గొప్ప తత్త్వం. అటువంటి గురువులకు సంబంధించి ఆషాఢమాసంలోని గురుపూర్ణిమరోజున అసురసంధ్యవేళలో సౌందర్యలహరివంటి మహోత్కృష్టవిషయం మీద తొమ్మిదిరోజులపాటు ఈ ప్రవచన కార్యక్రమం జరిగింది. అమ్మగురించి నాలుగు మాటలు చెప్పుకున్నా, చదువుకున్నా చాలు.

శ్రీగుణరత్నకోశంలో పరాశరభట్టర్ –

**స్తోతారం తముశంతి దేవి కవయో యో విస్తృణీతే గుణాన్**
**స్తోతవ్యస్య తతశ్చతే స్తుతిధురా మయ్యేవ విశ్రామ్యతి**
**యస్మాదస్మదమర్షణీయ ఫణితి స్వీకారతస్తే గుణాః**
**క్షాంత్యౌదార్యదయాదయో భగవతి స్వాం ప్రస్తువీరాన్ ప్రధాన్**

(శ్రీగుణరత్నకోశం – 6)

'అమ్మా, నేను చేతకానివాడిని. నాలుగుమాటలు చెపితే వాటిలో నీ ఓర్పు, దయ బయటకు వచ్చాయమ్మా. నాలుగు ముఖాలున్న బ్రహ్మగారు నిన్ను స్తోత్రం చేయలేకపోయారు. నేనా నిన్ను స్తోత్రం చేయగలవాడిని?' అంటారు. అంతటి పరమ పావనమయిన సౌందర్యలహరిని మనకు ఇచ్చిన మహాపురుషుడు శంకరులు.

## సౌందర్యలహరి భారతదేశంలో ఎలావచ్చింది?

సౌందర్యలహరి భారతదేశంలో ఎలావచ్చిందన్నదానిమీద, మార్కండేయ సంహితలో శంకరానందగిరి రాసిన శంకరభాష్యాలలో శంకరుల జీవితచరిత్రలో కొన్ని ఘట్టాలు మనకు ప్రస్తావన చేయబడ్డాయి.

ఆదిశంకరులు ఒకనాడు పార్వతీపరమేశ్వరుల దర్శనం కొఱకు కైలాస పర్వతానికి వెళ్లారు. సాక్షాత్తు పరమశివావతారమయిన శంకరులు మళ్లా శంకరుల దర్శనానికి వెళ్లడమేమిటని మీకు సందేహం కలగవచ్చు. అంటే మీరు రామాయణం బాలకాండను ఒకసారి పరిశీలించండి. రామచంద్రమూర్తి సాక్షాత్తుగా శ్రీమహావిష్ణువు అంశ. వాల్మీకి మహర్షి బాలకాండలో అంటారు –

**ఏతస్మిన్నంతరే విష్ణుః ఉపయాతో మహాద్యుతిః ।**
**శంఖచక్రగదాపాణిః పీతవాసా జగత్పతిః ॥**

(శ్రీరామాయణం – బాల– 15 – 16)

అటువంటి విష్ణువు అవతారమే పరశురాముడు. రామావతారం, పరశు రామావతారం కలుసుకున్నాయికదా! భాగవతంలో కృష్ణుడు, బలరాముడు విష్ణ్వంశతో ఒకే సమయంలో భూమి మీద నడయాడారు కదా! అందుకని పరమేశ్వరుని రీతి మనం ప్రశ్నించవలసిందిగా ఉండదు. ఒక గురుస్వరూపంతో వచ్చిన పరమశివుని అంశ శంకరభగవత్పాదులు. ఆయన కైలాసపర్వతం మీద ఉండే పార్వతీపరమేశ్వరుల దర్శనం కోసమని వెళ్ళారు. అపుడు పరమశివుడు వారికి ఆయిదు ఆత్మలింగాలను ప్రసాదించారు. అవే ఇప్పటికీ శృంగేరీపీఠంలో, కంచిపీఠంలో, కేదార్‌లో, నాల్గవది నేపాల్‌లోని నీలకంఠేశ్వరాలయంలో, అయిదవది చిదంబరంలో ఉన్నాయి. ఈ అయిదు లింగాలూ కూడా శంకరభగవత్పాదులు భూమి మీదికి తీసుకువచ్చి ఈ అయిదుచోట్ల ప్రతిష్ఠించారు. ఈ విషయం పరమయథార్థమని, నడిచే దేవుడని ప్రఖ్యాతిగాంచిన చంద్రశేఖరపరమాచార్య స్వామివారు కూడా ఉటంకించారు. అదే సమయంలో పరమశివుడు అయిదు లింగాలనిస్తే, అమ్మవారు సౌందర్యలహరి గ్రంథాన్ని శంకరభగవత్పాదులకిచ్చింది. ఇది మార్కండేయ సంహితాంతర్గతమయిన విషయం. మహాపురుషులయిన శ్రీచంద్రశేఖర పరమాచార్యస్వామివారుకూడా అంగీకరించి వ్యాఖ్యానించిన విషయం.

అపుడు శంకరులు ఆ అయిదు స్ఫటికలింగాలనూ, సౌందర్యలహరినీ తీసుకుని వస్తున్నారు. వస్తున్న సమయంలో నందికేశ్వరుడు ఎదురువచ్చి అపారమయిన పాపం

# శ్రీకామాక్షీ వైభవం

ప్రవచనం

బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు శర్మ

Read Sample

50/-



# శ్రీకామాక్షీ వైభవం

మనకు భారతదేశంలో సప్తమోక్షపురాలు ఉన్నాయి.

**అయోధ్యా మాయా కాశీ అవంతికా మథుర**
**కాంచీపురీ ద్వారవతీ చైవ సప్తయితే మోక్షదాయికా ॥**

ఆ నగరాలకు ఒక ప్రత్యేకమైన శక్తి ఉంది. అటువంటి నగరాలు ప్రవేశంచేసినంత మాత్రం చేత మోక్షానికి కారణమవుతాయి. వాటిని సప్తమోక్షపురాలు అని పిలుస్తారు. ఇందులో ఆరు పురాలు ఉత్తర భారతదేశంలో ఉన్నాయి. ఏడవది కాంచీపట్టణం ఒక్కటే దక్షిణ భారతదేశంలో ఉన్న ఏకైకమోక్షపురి. కాబట్టి కాంచీపురానికి విశేషమైన ప్రాధాన్యం. కాంచీపురంలో పరదేవత సాక్షాత్ కామాక్షి. కామాక్షి అన్న పేరు రావడానికి కారణం 'క' అన్న అక్షరం బ్రహ్మని ప్రతిపాదిస్తుంది. 'మ' అన్న అక్షరం లక్ష్మిని ప్రతిపాదిస్తుంది. బ్రహ్మ శక్తి సరస్వతి. విష్ణువు శక్తి లక్ష్మి. కామాక్షి అంటే ఒక కంటిలో సరస్వతీదేవి అనుగ్రహాన్ని, ఒక కంటిలో లక్ష్మీదేవి అనుగ్రహాన్ని తన దృష్టిప్రసారం చేత అనుగ్రహించగలిగిన తల్లి. కేవలం ఆవిడ చూపు పడితే చాలు, సరస్వతీ కటాక్షం కావాలనుకున్న వాళ్లకు సరస్వతీ కటాక్షం, లక్ష్మీకటాక్షం కావాలనుకున్నవాళ్ళకు లక్ష్మీకటాక్షం.

ఒకటి గమనించాలి. రెండుకళ్ళు తిప్పి చూస్తున్నప్పుడు ఏ వస్తువుని చూస్తున్నామో. ఆ వస్తువుని రెండుకళ్లతో చూస్తాం తప్ప ఒక కంటితో చూసి ఒక కన్ను మూసివేయడం, ఒక కంటితో చూడకపోవడం అన్నది ఉండదు. రెండు కళ్ళూ కలిసే చూస్తాయి. ఎవరు కామాక్షి అనుగ్రహానికి పాత్రులు అవుతారో వారు సరస్వతీ, లక్ష్మల కటాక్షానికి పాత్రులు అవుతారు. లక్ష్మీకటాక్షమన్న మాటని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. లక్ష్మీకటాక్షమంటే విపరీతమైన ఐశ్వర్యం అని అర్థం కాదు. లక్ష్మి అంటే గుర్తు. గుర్తించబడటానికి వీలుగా ఉంటాడు. దేని చేత అంటే, ఆయనకు ఉండవలసిన ఐశ్వర్యం ఏమిటి అంటే, ఆ వేళకు తినవలసిన పదార్థానికి అమ్మవారు లోటు రానివ్వదు. ఆ సమయానికి కావలసిన అన్నం ఆ సమయానికి అందుతుంది. ఏ సమయానికి కావలసిన సౌకర్యం ఆ సమయానికి అందుతుంది. సరస్వతీ కటాక్షం కావాలి అనుకున్నవాళ్ళకు సరస్వతీ కటాక్షం కలుగుతుంది. ఆయన నిత్యతృప్తుడై ఉంటాడు. ఇది ఐశ్వర్యం అన్నమాటకి సరైన అర్థం. నాకు ఇది లేదు అన్నమాట ఉండదు. నాకు ఈశ్వరుడు ఏమివ్వలేదు గనక అన్న మాట ఉంటుంది. నాకు ఆయన అన్నీ ఇచ్చాడన్న పరమతృప్తితో ఉంటాడు. తృప్తే ఐశ్వర్యం, ఎన్ని ఉన్నా నాకు ఏదో లేదు అన్నవాడు దరిద్రుడవుతాడు తప్ప ఐశ్వర్యవంతుడు అవడు.

రామాయణం బాలకాండలో అయోధ్యానగరంలో ఉండే ప్రజల గుణ గణాలను చెపుతూ వాల్మీకి మహర్షి ఒక మాట అంటారు.

**నా కుండలీ నామకుటీ నాస్రగ్వీ నాల్పభోగవాన్ ।**
**నామృష్టో నానులిప్తాంగో నాసుగంధశ్చ విద్యతే ॥**

అక్కడ ఎవరూ అల్పమైన భోగం కలవారు లేరు. అది సాధ్యమా? మీ ఊళ్ళో అందరూ సమానంగా సుఖపడుతున్నారని అంటే అది సత్యదూరం. ఎందుకంటే ఒకరు మేడలో ఉంటారు. ఒకరు పెంకుటింట్లో ఉంటారు. ఒకరు పాకలో ఉంటారు. ఒకరిదగ్గర కోటి రూపాయలు ఉంటాయి. ఒకరి దగ్గర లక్ష రూపాయలు ఉంటాయి. ఒకరికి రెక్కాడితే గానీ డొక్కాడని స్థితి ఉంటుంది. అప్పుడు అందరూ ఒకలా ఎలా భోగాన్ని అనుభవిస్తారు? సుఖం ఒకలా ఉండదు, తారతమ్యం ఉంటుంది. అటువంటప్పుడు నాల్పభోగవాన్ అన్నమాట ఎలా అన్వయమవుతుంది? మహర్షి ఆ శబ్దాన్ని ఎలా ప్రయోగించారు? మహాపురుషుడైన మహర్షి ఎక్కడా దోషభూయిష్ఠంగా మాట్లాడరు. అన్వయం జాగ్రత్తగా చేసుకోవాలి. తృప్తి లేనివాళ్ళు లేరు. ఎవరికి ఉన్నదానితో వారు తృప్తిగా ఉంటారు. అందరి భోగం ఒకటే. కోటి రూపాయలు ఉన్నవాడు ఏ తృప్తితో ఉన్నాడో, రెక్కాడితేగానీ డొక్కాడని వాడు అదే తృప్తితో ఉన్నాడు. అందరిదీ అదే తృప్తి అయినప్పుడు వాళ్ళ భోగంలో తేడా రాదు. అందుకే నాల్పభోగవాన్ అంటే ఒకే రకమైన తృప్తిని కలిగి ఉండటం. లక్ష్మీకటాక్షంలో ప్రధానమైన నాల్పభోగవాన్ అన్నమాట ఎలా అన్వయం అవుతుంది? లక్ష్మీకటాక్షంలో ప్రధానమైన లక్షణం ఏది అంటే తృప్తితో జీవనం చేయటం. తృప్తి ఎక్కడ ఉంటే అక్కడ శాంతి ఉంటుంది. ఎక్కడ శాంతి ఉందో వాడు ఇతరుల శాంతికి కారకుడు అవుతాడు. ఏ పూజ, క్రతువు చేసినా చివరకు దాని ఫలితం ఏమని చెపుతామంటే

**ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతి:**

శాంతి జరగాలి అని కోరుకుంటాం. ఆ శాంతికి ప్రధానమైంది ఏది అంటే తృప్తి. అది లేని నాడు శాంతి ఉండదు. అటువంటి తృప్తిని కలిగినవాళ్ళు లక్ష్మీ అనుగ్రహాన్ని పొందినవాళ్ళు. జీవితంలో కామాక్షి అనుగ్రహాన్ని పొందితే వెంపర్లాడడం, పరిగెత్తడం ఉండకుండా పరమప్రశాంతంగా ఉంటాడు. అలా ప్రశాంతంగా ఉండడానికి కావలసిన అధ్యవసాయంతో కూడుకున్న బుద్ధి లభించడానికి ప్రధానమైన హేతువు, ఆమె చూపులవల్ల కలిగిన సరస్వతీ కటాక్షం. అంటే కేవలం కొన్ని పద్యాలు, శ్లోకాలు వచ్చినవాళ్ళు కాదు. ఆ మాటకు యథార్థమైన అర్థం భగవత్ సంబంధమైన జ్ఞానాన్ని పొందినవాడు. అందువల్ల సరస్వతీకటాక్షాన్ని పొందినవాడిని పండితుడు అంటారు. పండాః అన్న శబ్దంలో నుంచి వచ్చింది. అంటే భక్తితత్పరుడైనవాడు. అన్నిటికీ పరమేశ్వరునితో చెప్పుకుంటూ ఉంటాడు. కష్టం, సుఖం ఏది వచ్చినా నేను కారణం అనడు. సుఖం కలిగితే ఇది పరదేవత అనుగ్రహం. నేను సుఖంగా ఉన్నాను. అమ్మా! నీకు కృతజ్ఞతలు. కష్టం వస్తే అమ్మా! గతంలో ఏదో పాపం చేసి ఉన్నాను. ఆ ఫలితం ఈ దుఃఖరూపంలో వచ్చింది. ఇక్కడతో చేసిన పాపం పోయింది. ఇంకొకసారి దుఃఖం రాకూడదు అంటే ఇంకొకసారి పాపం చేయకూడదు. కాబట్టి పాపం చేయకుండా ఉండగలిగిన బుద్ధిని నాకు కటాక్షించమని అడుగుతాడు. అది పండాః భక్తి కలిగినవారు అన్న మాటకు అర్థం. అంతే కానీ ఎంత పదార్థాన్ని, ఎన్ని తులసిదళాలను తీసుకుని వస్తాడు, ఎన్ని తామరపూలు, ఎన్ని మారేడు దళాలను పట్టుకుని వస్తాడు, ఎంత పూజ చేస్తుంటాడు అన్నది భక్తికాదు. శంకరభగవత్పాదులు శివానంద లహరి చేస్తూ,

# శ్రీమదాంధ్ర భాగవతం

ప్రవచనం

బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు శర్మ



# విషయసూచిక



# శ్రీమహా భాగవతము

# ప్రథమ స్కంధము

## 01. శ్రీ పోతన భాగవత రచన

వ్యాసభగవానుడు ఈ దేశమునకు చేసిన సేవ సామాన్యమయినది కాదు. ఆయన మహోత్కృష్టమయిన సేవ చేశారు. చేసి అంతటితో ఊరుకోలేదు. అల్పాయుర్దాయం కలిగి అనారోగ్యంతో ఉంటూ బుద్ధి ఎప్పుడూ కూడ అర్థకామములయందు మాత్రమే తగిలి ఉండే సామాన్య జనులు కలియుగంలో వేదములను నాలుగింటిని చదవడం దుస్సాధ్యమనే బుద్ధిచేత వ్యాసభగవానుడు వేదరాశిని నాలుగుగా విభాగం చేశారు. ఆయన వేదరాశినంతటిని ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అధర్వణవేదము అని నాలుగు భాగములుగా విభాగం చేశారు.

వేదంలో పూర్వభాగం అంతా మనం ఆచరించవలసిన విధివిధానములను గురించి, మనం ఆచరించిన విధివిధానములవలన మనం పొందే ఇహలౌకిక పారలౌకిక సౌఖ్యములనుగూర్చి వివరిస్తుంది. ఉత్తరభాగం అంతా కూడా మళ్లీ మనం ఒక అమ్మకడుపులో ప్రవేశించవలసిన అవసరంలేకుండ ఇదే తుట్టతుద జన్మ చేసుకోవడం కోసమని ఏ జ్ఞాన సముపార్జన చేయడం చేత మనకు కైవల్యం లభిస్తుందో దానినిగురించి తెలియజేస్తుంది. 'జ్ఞానాత్ కేవల కైవల్యం' జ్ఞానంచేత మాత్రమే కైవల్యం లభిస్తుంది.

పునరావృత్తిరహిత శాశ్వత శివసాయుజ్యసిద్ధి కొఱకు ఏ జ్ఞానమును మనం పొందాలో అటువంటి జ్ఞానమును వేదము ఉత్తరభాగం ప్రతిపాదన చేస్తుంది. ఆయన తన శిష్యుడయిన జైమినిచేత వేదమునకు పూర్వభాగమయిన కర్మకు సంబంధించిన, విషయములన్నిటికి వ్యాఖ్యానం చేయించారు. దానిని 'పూర్వమీమాంస' అంటారు. ఉత్తరభాగమంతా జ్ఞానమునకు సంబంధించినది. వ్యాసమహర్షియే స్వయంగా బ్రహ్మసూత్రములను రచించారు. ఈ బ్రహ్మసూత్రములనే 'ఉత్తరమీమాంస' అని కూడ అంటారు. మరల ఆయన పదునెనిమిది పురాణములను రచించారు. పురాణములను రచించడం అంటే తేలికయైన పనికాదు.

**'సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ**
**వంశానుచరితంచైవ పురాణం పంచలక్షణమ్'**

పురాణమునకు ఐదు లక్షణములు ఉండాలి. సర్గ, ప్రతిసర్గ అని విభాగం ఉండాలి. గొప్పగొప్ప వంశములను గురించి ప్రస్తావన చెయ్యాలి. అనేక మన్వంతరములలో జరిగిన విశేషములను చెప్పాలి. అది భగవత్సంబంధంగా దానిని ప్రతిపాదన చెయ్యకలిగిన శక్తి ఉండాలి. అటువంటి వాడు తప్ప పురాణమును చెప్పలేడు. అటువంటి పురాణములను రచించిన మహానుభావుడు వేదవ్యాసుడు. మనకి జ్ఞాపకం ఉండడం కోసమని తేలిక సూత్రము నొక దానిని పెద్దలు ప్రతిపాదించారు.

'మ' ద్వయం 'భ' ద్వయంచైవ 'బ్ర' త్రయం 'వ' చతుష్టయం
'అ' 'నా' 'ప' 'లిం' 'గ' 'కూ' 'స్కా' ని పురాణాని పృథక్ పృథక్. (దేవీ భాగవతము 1-3-21)

మద్వయం – 'మ' కారంతో రెండు పురాణములు ప్రారంభమవుతాయి. అందులో ఒకటి మార్కండేయ పురాణము, రెండవది మత్స్యపురాణము.

భద్వయం – 'భ' తో రెండు పురాణములు ప్రారంభమవుతాయి. అవి భాగవత పురాణము, భవిష్య పురాణము.

బ్రత్రయం – 'బ్ర' తో మూడు పురాణములు ప్రారంభమవుతాయి. అవి బ్రహ్మపురాణము, బ్రహ్మాండ పురాణము, బ్రహ్మవైవర్త పురాణము.

వచతుష్టయం – 'వ' కారంతో తో నాలుగు పురాణములు ప్రారంభమవుతాయి. అవి వరాహపురాణము, విష్ణుపురాణము, వామనపురాణము, వాయుపురాణము.

అనాపలింగకూస్కాని – అన్నప్పుడు ఒక్కొక్క అక్షరమునకు ఒక్కొక్క పురాణం వస్తుంది.

అ – అగ్నిపురాణము, నా – నారదపురాణము, ప – పద్మపురాణము

లిం – లింగపురాణము, గ – గరుడపురాణము, కూ – కూర్మపురాణము, స్కా– స్కాందపురాణము

వ్యాస భగవానులు వేదములను విభాగం చేసినప్పుడు ఒక్కొక్క వేదమును ఒక్కొక్క శిష్యుడికి అప్పచెప్పారు. వ్యాసుడు చేసిన సేవ అంతా ఇంతా కాదు.

# శ్రీ శివమహాపురాణము

ప్రవచనం

బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు శర్మ





# విషయసూచిక

# శ్రీ శివమహాపురాణము

## 1. ఉపోద్ఘాతము

### నాయనార్లు – పతంజలి – గురుపరంపర

'శివ' అనే శబ్దము చాలా గొప్పది. శివమహాపురాణము శివశబ్దము తోటే ప్రారంభమయింది. శివ శబ్దమును అమరకోశం వ్యాఖ్యానము చేసింది. అమరకోశము మనకు సాధికారికమయిన గ్రంథము. దానిని అమరసింహుడు అనబడే ఒక జైనుడు రచించాడు. ఆయన అమర కోశముతో పాటు అనేక గ్రంథములను రచించాడు. కాని శంకర భగవత్పాదులతో వాదమునకు దిగినప్పుడు శంకరుల చేతిలో ఓడిపోయాడు. అపుడు ఆయనకు బాధకలిగింది. 'నేను శంకరాచార్యుల వారి చేతిలో ఓడిపోయాను – కాబట్టి నేను రచించిన గ్రంథములన్నీ పనికిమాలినవి అయిపోయాయి' అని ఆయన తన గ్రంథములనన్నిటిని తగులబెట్టేశాడు. ఈ విషయం శంకరులకు తెలిసింది. ఆయన బహుకారుణ్యమూర్తి. ఆయన వచ్చి 'ఏంతపనిచేశావయ్యా! గ్రంథములను ఎందుకు తగులపెట్టావు?' అని అడిగారు. అప్పటికి ఇంకా ఒకే ఒక గ్రంథము మిగిలిపోయి ఉన్నది. అది అమరకోశము. అమరకోశము చాల గొప్ప గ్రంథము. అది మన సనాతనధర్మమునకు సంబంధించిన నామముల విషయంలో ఏ పక్షపాతం లేకుండా చక్కగా శ్రుతి ఎలా ప్రతిపాదించిందో, స్మృతులు, పురాణములు

ఎలా ప్రతిపాదించాయో తాత్త్వికమయిన విషయములను, నామములకు, అనేకమయిన విషయములకు ఉండే అర్థములను అలా ప్రతిపాదన చేసింది. అమరసింహుని ఆ గ్రంథాన్ని అమరకోశము అని పిలుస్తారు. ఏదయినా ఒక విషయమును ప్రతిపాదన చేసేముందు సాధారణంగా ఒకసారి అమరకోశమును చూస్తూ ఉంటారు.

శివ అన్నమాటను ఏ విధంగా మనం అర్థం చేసుకోవాలి? అమరకోశంలో దానికి అనేక రకములయిన అర్థములు చెప్పబడ్డాయి. 'శివ' 'శివా' అనే రెండు శబ్దములు మనకి లోకములో వాడుకలో ఉన్నాయి. 'శివ' అంటే శంకరుడు. 'శివా' అంటే పార్వతీదేవి. ఆయన యొక్క శక్తి స్వరూపము.

అమరకోశములో 'శివః' అంటే – 'శామ్యతి, పరమానందరూపత్వాన్నిర్వికారో భవతి యితి శివః' – శివుడు నిర్వికారుడు. మనకు వికారములు ఉంటాయి. ఈ జగత్తులో ఉన్న సమస్తప్రాణులకు, సమస్తజీవులకు ఆరు వికారములు ఉంటాయి. వీటిని షడ్వికారములు అంటారు. కాలములో ఏదయినా వచ్చినట్లయితే దానికి పుట్టిన తేదీ అని ఒకటి వుంటుంది. పుట్టినతేదీ పడినది అంటే అది షడ్వికారములకు లోనయిపోతుంది అని మనం గుర్తుపెట్టుకోవాలి. ఈ భావన మీలో బాగా నాటుకున్నట్లయితే అసలు సగానికిసగం లోకంపట్ల ఉండే తాదాత్మ్యం తగ్గిపోతుంది. జీవుడు పుట్టడంతోటే వానికి జన్మము అనే తేదీ కాలములో వచ్చింది. ఒక జన్మతేదీ ఏర్పడింది. అంతకు పూర్వం లేనిది ఇపుడు పుట్టినది. ఆ జీవి యిపుడు భూమిపై ఉన్నది. తరువాత ఆ జీవి పెరుగుతుంది. పెరిగి కొంతకాలమునకు మరల తరగడం ప్రారంభిస్తుంది. కొంతకాలమునకు శరీరం వడిలిపోయి క్షీణించిపోవడం ప్రారంభమయి పోతుంది. ఇంకా కొంతకాలం గడిచేసరికి ఆ శరీరం నశించిపోతుంది. అంత్యేష్టి సంస్కారం చేయబడుతుంది. ఈ ఆరు వికారములు సమస్తప్రాణులకు ఉండితీరుతాయి. ఈ ఆరు వికారములు లేనిది ఏదయినా ఉన్నదా? ఉన్నది. అదే 'శివ'. అది కాలములో పుట్టలేదు. కాలములో పెరగలేదు. కాలములో ఉండలేదు. కాలములో నశించదు. ఎవరినుండి వచ్చినదో, ఎవరియందు పెరిగినదో, ఎవరియందు లయించిపోతున్నదో వాడు మాత్రం అలా ఉండిపోతున్నాడు. అలా ఉండిపోయినవాడు ఎవడు? వాడు పరబ్రహ్మము. వానికి కదలికలేదు. వాడు ముందరా ఉన్నాడు – చివరా ఉన్నాడు. అలా ఉన్నవాడు ఎవడో వాడు నిర్వికారుడు. వానికి వికారములు లేవు, కాబట్టి వాని జుట్టు తెల్లబడదు. వానికి ముసలితనం లేదు. వానిని కాలము లొంగదీయలేదు. కాబట్టి వాడు నిత్యయౌవనుడు. అందుకే మనం శివుని గురించి చెప్పినా, అమ్మవారి గురించి చెప్పినా –

'నమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యాం' అంటాము. వారికి వార్థక్యము రాదు. ఎందుచేత? మీరు కాలమునకు వశులగుట వలన కాలమునందు మీకు మార్పు వస్తుంది.

కాలస్వరూపములో మీయందు మార్పులు తెచ్చేవాడు ఎవడున్నాడో వాడు మార్పునకు అతీతుడిగా సాక్షిగా ఉన్నాడు. కదిలే వస్తువుకి కదలని వస్తువు ఆధారమై ఉంటుంది. వికారములు కలిగిన జగత్తుకు ఏది వికారములకు అతీతమైవున్నదో అది ఆధారమై ఉన్నది. దానియందే ఈ సమస్త జగత్తు పుట్టి పెరిగి లయిస్తున్నది. అటువంటిది ఏదో అది వికారాతీతస్థితి కలిగిన పరబ్రహ్మము. దానిని ఒక నామవాచకముతో పిలవాలని అనుకుంటే 'శివ' అని పిలువవచ్చు. కాబట్టి ఇపుడు శివశబ్దము పరబ్రహ్మము గురించి చెపుతోంది.

ఆయన నిర్వికారమై, నిరంజనమై ఉంటాడు. ఇటువంటి పరమాత్మ స్వరూపం మీ కన్నులకు కనపడదు. వికారము పొందుతున్న జగత్తు మీ కళ్ళకు కనపడుతుంది. కాని వికారము చెందుతున్న జగత్తుకు ఆధారముగా వున్నవాడు మీ కళ్ళకు కనపడడు. మరి ఈయనకు ఒక రూపం తీసుకు వచ్చి చూస్తే ఎలా ఉంటాడు?

అమరకోశంలో అమరసింహుడు ఆయనను 'పరమానందరూపత్వ' అంటాడు. ఆయన ఎప్పుడూ పరమానందమును పొందుతూంటాడు అని చెప్పాడు. మన అందరికీ సుఖదుఃఖములు అనే బంధములు ఉంటాయి. ఎల్లకాలం అన్నివేళలా ఆనందముతో ఉండము. ఆయనకు వికారములు ఏమీలేవు కాబట్టి ఆయన ఎప్పుడూ పరమానందంతో ఉంటాడు. ఈ పరమానందము అనేది బయటవున్న వస్తువులలో లేదు. లోపలే ఉంది. ఆ ఆనందంతో తన్మయత్వమును పొందుతూ ఉంటాడు. దానిని నోటితో చెప్పడం కుదరదు. పద్మాసనం వేసుకుని అరమోడ్పు కన్నులతో వుండి తనలోతాను రమిస్తూ కనపడుతూ ఉంటాడు. అనగా ఘనీభవించిన ఆనందస్వరూపమే పరమాత్మ స్వరూపము. నిత్యానందము ఏదివున్నదో దానిని రాశీభూతంచేస్తే అదే 'శివ.' ఆనందఘనమే పరమాత్మ. కాబట్టి ఆయన అన్ని వికారములకు అతీతుడై తనలోతాను రమించిపోతూ తానే చిదానందరూపుడై ఉంటాడు. ఆయనకు మనస్సులో కదలిక ఉండదు.

మనం అందరం కూడ కదులుతున్న తరంగములతో కూడిన సరోవరములలాంటి వారము. మనం ఉదయం నిద్రలేవగానే పరమాత్మతో కూడిన మనస్సు పరమాత్మనుండి విడివడుతుంది. వెంటనే అది ఒక ఆలోచన మొదలు పెడుతుంది. చేయవలసిన పనులకు సంబంధించిన అనేక సంకల్పములు ఒకదానివెంట ఒకటి రావడం ప్రారంభిస్తాయి. ఇవి సుఖములకు, దుఃఖములకు కూడ హేతువులు అవుతుంటాయి. ఇటువంటి సంకల్పములకు అతీతుడై ఈ సంకల్పములు దేనిలోనుండి పుడుతున్నాయో అది తానై నిరంజనస్వరూపమై, ఆనందఘనమై కూర్చున్న వాడెవరో వాడు పరమాత్మ. వాడు శంకరుడు. ఆయనే శివుడు. ఆయన సమస్తమును చూస్తూ ఉంటాడు. అటువంటి ఆనందఘనమునకు 'శివ' అనిపేరు. అటువంటి ఆనందస్వరూపులుగా మారడమే

# శ్రీసుబ్రహ్మణ్య వైభవం

సుబ్రహ్మణ్య అవతారం ఎంత ఉత్కృష్టమైనదంటే ఆ స్వామి అవతరించడంకోసం ముప్పైమూడు కోట్లమంది దేవతలూ కన్నులు కాయలుకాచేటట్లు ఎదురుచూశారు. వాల్మీకి మహర్షి శ్రీమద్రామాయణాన్ని 24000 శ్లోకాలలో రచించారు. అంత చెప్పిన మహర్షి రామాయణంలో ఏ ఘట్టానికీ కూడా ఫలశ్రుతి చెప్పడానికి ఇచ్ఛగించలేదు. కొన్ని సందర్భాలకి మాత్రమే ఫలశ్రుతి చెప్పారు. అలా చెప్పినవాటిలో శ్రీసుబ్రహ్మణ్యేశ్వరస్వామి జననం ఒకటి.

కుమారసంభవరచన జరిగినప్పటి కాలం నుండి ఇప్పటికీ పెద్దలు షణ్ముఖోత్పత్తిపారాయణ చేయవలసి వస్తే బాలకాండలో చెప్పిన షణ్ముఖోత్పత్తినే పారాయణ చేస్తారు, ఈ వృత్తాంతం వినడమెంత గొప్పదంటే, జన్మజన్మాంతరపాపాలను అనుభవించడానికి జన్మించే శిశువు, తల్లి గర్భం లోపల పిండంగా ఉన్నప్పుడు కూడా సంస్కరించే శక్తి కలిగిన ఏకైక ఆఖ్యానం. సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఉత్పత్తి ఒక్కటే అటువంటిదని పెద్దలు చెప్పారు. అందుకే ఇప్పటికీ గర్భిణులు సుబ్రహ్మణ్యోత్పత్తిని వింటారు. కొంత సంస్కృతం తెలిసినవారు, బాలకాండలోని ఆ షణ్ముఖోత్పత్తిని – రెండు–మూడు సర్గలలో

ఉన్న ఆ విషయాన్ని – పారాయణ చేస్తారు. ఇప్పటికీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వైభవానికి లోకంలో ఎంత ప్రాధాన్యం ఉన్నదంటే వ్యాధులను నయం చెయ్యడం దగ్గరి నుంచి సంచితంగా వస్తున్న పాపాల రాశిని దగ్ధం చేసేవరకు సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వైభవం వినడం, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి స్తోత్రాన్ని చదవడం విశేషమైన ప్రాధాన్యాన్ని సంతరించుకున్నాయి.

సుబ్రహ్మణ్యోత్పత్తికి ముందు చాలా నేపథ్యం నడిచింది. పరదేవత యందు విశేషమైన లక్షణం ఒకటి ఉంటుంది. ఆమె మహాపతివ్రత. ఆమె ఎన్నడూ కూడా భర్తను విడిచిపెట్టి ఉండేది కాదు. ఎప్పుడెప్పుడు భగవంతుడు అవతారస్వీకారం చేస్తే, అప్పుడప్పుడు తల్లి కూడా అవతారస్వీకారం చేస్తుంది. ఆమె ఎంతమందికైనా కుమార్తెగా వస్తుంది. అసలే కుటుంబంలో ఆడపిల్ల ఉన్నా ఆమె పరదేవత స్వరూపిణే. అందుకే రామాయణంలో కన్యాదానం చేసేటపుడు వాడే శ్లోకం, ఈ లోకంలో ఎవరు, ఎప్పుడు కన్యాదానం చేసినా వాడవలసిన మాటలతో కూడుకున్నదై ఉంటుంది. అటువంటి అమ్మవారు ఎంతమందికైనా కూతురుగా రావడానికి అంగీకరిస్తుంది. ఆమె ఎందరినో తరింపజేయడానికి వాళ్ళకి కూతురుగా వచ్చింది. ఒకప్పుడు కాత్యాయనమహర్షికి కూతురై కాత్యాయనీహైమవతి అయినది. కాని ఎన్ని అవతారాలు స్వీకరించినా ఆమెకు భర్త మాత్రం పరమేశ్వరుడే. అక్కడే పురుషుడైనా నిలబడితే అమ్మవారి కళ్లలో రౌద్రరసం కనపడుతుందని చెప్పారు శంకరాచార్యులవారు.

అమ్మ కళ్లెప్పుడు ఎందుకు ఎరుపెక్కుతాయంటే, నేను మగవాడిని అన్న భావనతో ఎవరయినా పరదేవత ఎదురుగా నిలబడితే 'శివే శృంగారాతదితరజనే కుత్సనపరా' అన్నారు. అమ్మా! నేను నీ కుమారుణ్ణి. అమ్మా అనే భావనతో నిలబడినవారిని చూస్తే అమ్మ కళ్లనుండి కారుణ్యమొలుకుతుందట. అటువంటి తల్లి భక్తికి పరవశించిపోయి అవతారస్వీకారం చేసింది. ఆర్షసంప్రదాయంలో

